# భవభూతి నాటక కథలు



8133
షు - క్ష

మాక్మిలన్

# భవభూతి నాటక కథలు

ఇది

ఆంధ్రవిశ్వ విద్యాలయ సర్వకళాశాలా పండితులగు

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారిచే

రచియింపబడినది.

ఐదవ కూర్పు.

మాక్మిలన్ అండు కంపెని లిమిటెడ్
మదరాసు  బొంబాయి  కలకత్తా  లండను
1950

# పీఠిక

ఆంధ్రవచనకావ్యములలో వన్నెకెక్కిన "భవభూతి నాటకముల తెలుఁగువచన" మనెడి యీ పుస్తకమును ఆంధ్ర విశ్వవిద్యాలయ సర్వకళాశాలా పండితులగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తా మాంధ్రసాహిత్య పరిషత్తునఁ బండితులుగానున్నతఱి రచియించి 1915 వ సంవత్సరమునఁ దొలుతఁ బ్రకటించిరి. 1918 వ సంవత్సరముననుు, 1920 వ సంవత్సరమునను ఇది అచ్చొత్తింపఁబడియె. ఈ రూపకముల కథలు, గురుజనభక్తి, నీతిధైర్యశౌర్యసాహసములు, పాతివ్రత్యము, సత్యము, దయ, మైత్రి, కార్యదక్షత మొదలగునెల్ల మానవధర్మములను, స్త్రీవిద్య, వివాహపద్ధతి మొదలగు సంఘధర్మములను బోధించు ప్రాచీనదేశ నాగరకతను దెల్పుచు లోకజ్ఞానదాయకములై కల్పనాచాతుర్యంబున విలసిల్లుచున్నవి. పాఠశాలలందలి ప్రకృతస్థితి ననుసరించి సులభశైలిని వ్రాయఁబడినవి. ఇందు మాలతీ మాధవమున శృంగారరస వర్ణనములు పరిత్యజించి కేవల కథాభాగము మాత్రమే తెలుపఁబడెను.

శ్రీరస్తు.

ఓం నమః పరబ్రహ్మణే.

# భవభూతి నాటక కథలు.

# 1. మహావీర చరిత్రము

విశ్వామిత్రుఁ డను మహాముని యజ్ఞము సేయఁ దల పెట్టి యది రాక్షసబాధ లేకుండఁగ నిరంతరాయముగా నెఱ వేఱుటకై యయోధ్యాపురంబునకు వచ్చి దశరథమహా రాజును యాచించి శ్రీరామలక్ష్మణులను దనతపోవనంబునకుఁ దీసికొనివెళ్లెను. ఈ జన్నమునకుఁ బిలువఁబడిన జనకచక్రవర్తి తాను గూడ యజ్ఞదీక్షలోఁ బ్రవేశించినవాఁ డగుటచే సీత, ఊర్మిళ యను తనపుత్రికలతోఁ గూడఁ దన తమ్ముఁడగు కుశ ధ్వజుని విశ్వామిత్రు నాశ్రమంబునకుఁ బయనముచేసి పంపెను. అతఁ డాకన్నెలతోఁగూడ రథ మెక్కి బయలువెడలి విశ్వా మిత్రునిమహిమ నాపిల్లలలకు బోధించుచు వచ్చి కౌశికీనదీతీర మందలి సిద్ధాశ్రమమునొద్ద నరదము దిగెను. అంతలో నీ రాజురాక నెఱింగినకౌశికుఁడు రామలక్ష్మణులతోఁగూడనాతని కెదురుగా వచ్చుచుఁ దనలో 'మేలు మేలు, విదేహరాజు నామాట తీసివేయక సీతోర్మిళలతోఁ గుశధ్వజుని బంపెను. ఇఁక రాక్షసనాశనము గావించుట, యజ్ఞము నిర్వహించుట, శ్రీరామునకు సీతను బెండ్లిసేయుట, రాముని కీర్తి లోకంబునఁ బ్రకటించుట, యనుకార్యములు క్రమముగాఁ జేయవలయును'

అని తలంచికొనుచుఁ గుశధ్వజుని సమీపించు చుండఁగా, రామలక్ష్మణులు 'మహాత్మా! మన మిప్పుడు చూడఁబోవు నతఁ డెవఁ' డని యడిగిరి. అంత నమ్ముని వారలతో 'విదేహ దేశ ప్రభువును యాజ్ఞవల్క్యమునికి శిష్యుఁడును బ్రహ్మవేత్తయు నగు జనకచక్రవర్తిని వినలేదా?' అని పలికి. 'ఓహో! తన యింటిలో శివధనుస్సు నుంచుకొని పూజించునతఁడ్వును, అయోనిజాతయగు కన్యను బెంచునాతఁడు నగు సీరధ్వజుఁడా' యన వారు నుడువ 'నవ్వునవ్వు'నని నవ్వుచు 'నాతని తమ్ముఁడగు కుశధ్వజుఁడు మనయజ్ఞమునకు వచ్చె నతని కెదు రేగుచుంటి' మని చెప్పి యారాజును దారసించెను. కుశధ్వజుఁడును విశ్వామిత్రునకు నమస్కరించి 'ఇది భూపుత్త్రిక యగు సీత, ఇది మా యన్నగారికూఁతురగు నూర్మిళ' యని చూపి వారిచే నమస్కరింపఁజేసి యాతని దీవనల నంది 'మునీంద్రా! బ్రాహ్మణధర్మములును క్షత్త్రియధర్మములు నొక్కచోఁ గూడినట్లుగా నున్న యీమనోహరకుమారు లెవ'రని యడిగెను. గాధేయుం డును 'వీరు దశరథమహారాజుపుత్త్రులగు రామలక్ష్మణు' లని తెల్పెను. ఆ బాలురను కుశధ్వజునకు నమస్కరింప నతండు వారిని గౌఁగిలించుకొని కౌశికునితో రఘువంశమును గూర్చి ప్రశంసించె. అంత మునియనుమతి నందఱు నొకచెట్టునీడ నుపవసించిరి. సీతారాములును, ఊర్మిళాలక్ష్మణులును బరస్పరము సాభిప్రాయముగాఁ జూచికొని మనస్సులలో నానందించు చుండిరి.

అంత 'రామచంద్రా! జయము జయము' అని పొగడుచు నొక వనిత యచ్చటికి రాఁగా, నీమె యహల్య యను పేరు గల గౌతముని భార్య యనియు భర్తచే ఱాయిగా

శపింపఁబడిన యీమెకు శ్రీరామునిచే శాపవిముక్తి గలిగె ననియుఁ గౌశికుఁడు రాజుతోఁ జెప్పఁగా నతండు కొంత ప్రశంసించి తనలో 'అహా! యీబాలుఁడు శివశరాసనము వంచి మా యున్న ప్రతిజ్ఞను నెఱవేర్చినచో నితనికి సీతనిచ్చి పెండ్లిసేయుదుము గదా' యని యువ్విళు లూరుచుండెను. మఱియు నంతలో నొక రాక్షసుఁ డచ్చటికివచ్చి 'హా కౌశిక కుశధ్వజులారా! మిథిలానగరంబున జనకచక్రవర్తి [illegible] యాతని మాటచే మీయొద్దకు వచ్చితిని. నేను రావణునకుఁ బురోహితుఁడను. నా పేరు సర్వమాయుఁడు. ఇంద్రునకుఁ గూడఁ దండనీయుఁ డగు మా రాజు జానకిని బెండ్లియాడఁ గోరి తన యభీష్టము మీకుఁ దెల్పుటకై సన్నిధులకుఁ బంపె' నని చెప్పఁగా వారాలోచించుచు నూరకుండిరి. సీతోర్మిళలు చింతించుచుండిరి. లక్ష్మణుఁడు రామునింజూచి మెల్లగా 'అన్నా! మహాత్ముఁడగు రాక్షసుఁ డీ రాజకన్యను బెండ్లియాడఁ గోరె నఁట చూచితివా?' యనఁగా, రాముఁడు 'తమ్ముఁడా! తప్పేమి? కన్నె యుండఁగాను గోరఁ దగిన దగుటచే. నెట్టివాఁ డయిన నభిలషించును. అట్టియెడ బ్రహ్మకు మునిమనుమఁడు మహాశూరుఁడు లంకాపురి రాజు నగు రావణుఁడు కోరుట యాశ్చర్యమా' అని చెప్ప 'నీసౌజన్యమే కదా లోకకంటకుఁ డైన రక్కసుని గారవించుచున్నది' అని సౌమిత్రి యూరక యుండెను. అంత సర్వమాయుఁడు 'ఓ మునిరాజులారా! ఏమీ యాలోచనము? ఎవనిబొమ్ము తగిలి వజ్రాయుధము ముక్క ముక్కలయ్యెనో యెవనియురము దాఁకి యైరావతము దంతము మొక్కవోయెనో యాతనిపక్షమున సీత లక్ష్మివలె నుండు' నని చెప్పుచున్నంతలో భయంకరము నసహ్యాకరము

నగు వేషముతో నొకరాక్షసియచ్చటికివచ్చె. దానిం జూచి యందఱు దిగ్గన లేచిరి. అంత విశ్వామిత్రుఁడు 'రామా! యిది సుందునకు భార్యయు సుబాహుమారీచులకుఁ దల్లియు నగు తాటక. ఈ దుర్మార్గురాలిని వధింపు' మని నియోగింప, రాముఁడు మనసులో నిది యాఁడుది యని శంకించియుఁ బూజ్యుని యాజ్ఞ దాఁట లేక దాని నొక్క బాణంబున నేలఁ గూల్చెను. రాజ తాపసులు సంతసించిరి. రాజకన్య లాశ్చర్య పడిరి. రాక్షసుఁడు విచారమగ్నుఁడై 'అయ్యో తాటకా! నేను ముదుసలిని. ఏమిచేయఁగలను! దానవులకును దాన వేంద్రునకుఁ గూడ నిప్పుడే మహాపరాభవ మంకురించెను' అని మనమున విచారించుచు 'నేమయ్యా! సమాధాన మేమి'' యని మరల వారి నడిగె. అంత విశ్వామిత్రుఁడు 'నీకిం దెవ్వరును సమాధానము చెప్పువారు లేరు. మిథిలకుఁ బోయి సీరధ్వజు నడుగుము, పొమ్ము' అని బదులు సెప్పి ''యిదియే శ్రీరాము నకు దివ్యాస్త్రము లుపదేశింపఁ దగిన సమయ'' మని యాలో చించి ప్రయోగ సంహారములతో జృంభకాస్త్రంబును దక్కిన దివ్యాస్త్రములను నుపదేశించెను. అంత నాదివ్యా స్త్రంబు లన్నియు మహాతేజస్సుతో రామునకుఁ బ్రత్యక్షము కాఁగా రాముఁ డాయస్త్రములకును గురువునకును నమస్క రించి ''అయ్యా! నా తమ్మునకుఁ గూడ నీధనుస్సంప్రదాయ మొసఁగింపు'' మని కౌశికుం గోరెను. విశ్వామిత్రుండును సౌమిత్రికి శస్త్రమర్మ మనుగ్రహించినపిదప శ్రీరాముని యానతిచే నాయస్త్రంబు లన్నియు నంతర్ధానమయ్యెను.

పిదపఁ గుశధ్వజుఁడు 'మునీంద్రా! నీ యనుగ్రహంబు నకుఁ బాత్రుఁడైన యీ రామునకుఁ గన్నె నిచ్చి దశరథునితో

సంబంధము సేయఁ దలఁచితిని గాని మా యన్న చేసినప్రతిన
యొకటి యడ్డముగా నున్న' దన, గాధినందనుఁడు 'ఓరాజా!
యింకను సందియమా? తలఁచినంతనే దగ్గఱకు వచ్చు శివకా
ర్ముకము నిందులకు రప్పింపు' మన నతండు నట్లు ధ్యానించి
యావింటిని రావించె. అంత రాముఁడు విశ్వామిత్రు నానతిచేఁ
గుశధ్వజుఁ డానందించునట్లు సీతోర్మిళలు సంతోషపరవశ
లగునట్లు జనకుని ప్రతిన ఫలముఁ గాంచునట్లు సర్వమాయుని
గుండె పగులునట్లు శివధనుస్సు నెక్కువెట్టి రెండుముక్కలు
సేసెను. పిదప రాజు 'మునీంద్రా, మేము కృతార్థులమైతిమి.
మాయన్నపణంబు ఫలవంత మయ్యె. ఇపుడే శ్రీరామునకు
సీతను లక్ష్మణునకు నూర్మిళ నొసంగితిని. అనుగ్రహింపు' మనఁ
గౌశికుఁడు 'రాజా! మేలు మేలు. ఇంకొక్కటి గలదు. మాండ
వీశ్రుతకీర్తులను భరత శత్రుఘ్నుల కర్పింపు' మని కోరెను.
రాజును సంతసించి 'జనకశతానందులకుఁ జెప్పి కదా చేయ
వలయు' ననగా, నతండు 'నేనే వారని భావింపు' మన రాజు
నట్లంగీకరించె. అంత విశ్వామిత్రుఁడు తనశిష్యుఁడగు శున
శ్శేపునిఁ బిలిచి, 'ఓయీ! నీ వయోధ్యాపురంబున కేగి దశరథ
మహారాజుతో నీపుత్రులు నలువురకు జనకచక్రవర్తి కూఁతుల
నలువుర నిచ్చి పెండ్లిసేయుటకు నిశ్చయింపఁబడిన దనియు,
నాకును జనకునకును యజ్ఞదీక్ష తీఱిన వెనుక విదేహ నగర
ములో నీవివాహములు జరుగు ననియు, నాఁటికి బంధుమిత్ర
కళత్రాదులతో వసిష్ఠాదిమహామునులతో నచ్చటికి రావలయు
ననియు, నామాటగా విన్నవించి రమ్మని వానిం బనిచెను. ఇ
దంతయుఁ గనుచున్న సర్వమాయుఁడు "ఏమయ్యా! నామాట
సరకు గొనక రావణు నవమానించుచున్నారు. ఎట్లయిననుసీత

లంకాపురంబు సేరును. మీకును బంధము సంభవించును. ఇట్టిది రాకుండఁగఁ జూడఁదగు” నను నంతలో నిరువురు రాక్షసులు ససైన్యంబుగ నచ్చటికిఁ బరుగెత్తికొనివచ్చిరి. వారిం జూచి రాజు వీ రెవ రని విశ్వామిత్రు నడుగ నతండు ‘వీరే సుబాహు మారీచులు. కుమారా! చూచెద వేల? యజ్ఞవిఘ్నకారులగు వీరిని వధింపు’ మని చెప్ప నబ్బాలుఁడు నిశిత శరంబులతో సైనికులను సుబాహుని నేలఁ గూల్చి మారీచుని వాయవ్యాస్త్రంబున నెగురఁ గొట్టెను. అంత విశ్వామిత్రుఁడు నిరంతరాయముగా జన్నము నిర్వహించెను. ఇదంతయుఁ గన్నులారఁ గని సర్వమాయుఁ డతివేగంబున లంకకేగి యీవృత్తాంత మంతయు రావణునకు మాతామహుఁడును మంత్రియు నగు మాల్యవంతునకు విన్నవించెను.

అంతనొకనాఁడు మాల్యవంతుఁడు రావణుని కోరిక నెఱవేఱమికిని శ్రీరామునిమహిమమునకును బరితపించుచుండఁగా నంతకు మున్నె విదేహపురమందలివార్త లెఱింగి వచ్చుటకై వెళ్లివచ్చిన శూర్పణఖ యచ్చటికివచ్చి ‘తాతా! మిథిలలో రామాదులకు వివాహములు జరిగినవి. అగస్త్యుఁడు శ్రీరామునకుఁ గానుకగా మహేంద్రాస్త్ర మొసంగెను. మాం యన్నయగు దశముఖుఁడు నీవృత్తాంతంబున కత్యంతము వగచుచుండె’నని చెప్పనతండు “అకటా! యెట్టి యిక్కట్టువచ్చెను! భూమిలో నున్నయుత్తమాస్త్రంబు లెల్ల రామునకుఁ బ్రహ్మర్షులొసంగిరి. ఇతఁడు సామాన్యనరుఁడు గాఁడు. ఇదిగాక బ్రహ్మ మున్ను రావణున కెల్లవరంబులిచ్చుచు మనుష్యునివలనభయము కలుగు నని వక్కాణించె. ఇదంతయుఁ దలఁపఁగా నా మనస్సు మిక్కిలి పరితపించుచున్నది. ఇది యిట్లుండఁగా మన

రాజునోరు విడిచి సీత నడిగియు వ్యర్థమనోరథుఁడయ్యె. మను ష్యమాత్రుఁ డాకాంతను బెండ్లియాడెను. సీత లభింపక పోవు టయు నరునియౌద్ధత్యమును జూచి త్రిలోక శూరుఁ డగు నీ పంక్తికంఠుఁ డూరకుండఁడు. ఇఁక నిది యెట్లు పరిణమించునో తెలియరాకున్నది'' అని చెప్పుచుండఁగాఁ బరశురాముని శిష్యుఁ డొకజాబు తీసికొని వచ్చి యాతనిచేతికిచ్చె. అదివిప్పి శూర్ప ణఖ కిట్లు చదివి వినిపించెను.

'స్వస్తి మహేంద్రద్వీప నివాసి యగుపరశురాముఁడు పరమశివభక్తుఁడు లంకాధినాథుఁడు నగు రావణునకు నమస్క రించి లంకారాజ్యమంత్రి యగుమాల్యవంతునకు వ్రాయున దేమనఁగా:-మే మభయ మిచ్చి సంరక్షించుచున్న తపోధను లకు బాధ గలిగించుచు మీ రంపిన విరాధ దనుకబంధాది రాక్షసులు దండకారణ్యప్రాంతముల సంచరించుచున్నారని వినుచుంటిమి. కావున వారి నచ్చటినుండి మరలించి మాయ భీష్టంబు నెఱవేర్పుము. భూసురులకు బాధ గలిగింపకుండుట మీకు శుభ మిచ్చును. అట్లు చేయనియెడల మీ మిత్రుఁడగు పరశురాముఁడు దుర్మనస్కుఁడగును.' ఇది విని శూర్పణఖ 'తాతా! ఈ వ్రాఁత మిగుల మృదులముగాను గంభీరముగాను గూడ నున్న' దన, నతండు 'కానిమ్ము. రాముఁడు తన గురువు విల్లు విఱిచెనని తెలిసినచో నితనికిఁ గోపము రాక మానదు. దీనిమూలముగా నీ రిపువురను బోరాడి మడిసి రేని మనకు మేలు. ఎవఁడో యొకఁడు నశించును, ఒకఁడు గెలుచు నని యందుమా? సకల క్షత్రియనాశకుఁ డగుపరశురామున కే జయము గలుగునని నిశ్చయింపవచ్చును. రావణుని గర్వమణం చిన కార్తవీర్యునిఁజంపినజామదగ్న్యుని శ్రీరాముఁడు గెలుచు

ననుట కల్ల. కావున రేణుకానందనునకుఁ గోపము పుట్టించు టకై మహేంద్రద్వీపమునకుఁ బోవుదము, లెమ్ము', అని చెప్పి శూర్పణఖతో నాతం డచ్చోటికేగి మిథిలకుఁ బోవ భార్గవుం బురికొల్పెను.

అనంతరము మిథిలలో (శ్రీ)రామచంద్రుఁడు సతీమణి యగు సీతం గూడి సుఖంబుండ నొకనాఁడు 'ఓ యంతఃపుర పరిచారకులారా! కైలాసపర్వతమును పెకలించి ముల్లోక ములు జయించి గర్వించుచున్న రావణుని లీలతో గెల్చినకార్త వీర్యుని వేయిభుజములు నఱికి యిరువదియొక్కసారి రాజకు లము నిర్మూలము గావించినవాఁడును హేరంబాదులతోఁగూ డిన కుమారస్వామి నోడించి యీశ్వరుని మెప్పుగొనినవాఁడు నగు పరశురాముఁడు శివధనుస్సు విఱిచినందుకుఁ గోపగించి వచ్చెనని మీ రామునితోఁ జెప్పుఁడు' అని కేకవేయుచు భా ర్గవుఁ డచ్చోటికి వచ్చెను. రాముఁ డీవృత్తాంతము సేవకుల వలన విని, భయపడుచున్న సీతకు నామె చెలికత్తెలకును ధైర్య ము సెప్పి 'రాముఁడెక్కడ? దాశరథి యెక్కడ? నాగురువు విల్లు విఱిచినవాఁ డెక్కడ?' యని మఱిమఱి కేకలువైచుచుఁ ద్వరపడుచు నంతిపురములోనికి వచ్చుచున్న యా పరశురా మున కెదురుగావచ్చి 'ఆర్యా! నేనే రాముఁడను. ఇటురమ్ము' అని పలికి యెదురుగా నిలువఁబడెను. జామదగ్న్యుఁ డాతనిఁ జూచి 'అకటా! ఈపంచశిఖలు, ఈముద్దులొలుకుమొగము, ఈ నీలమేఘచ్ఛాయఁ బోలు మైచాయయు గలిగిన యీ క్రొత్త పెండ్లికొడుకు సమాప్తి నొందుకాలము వచ్చిన' దని తలంచి 'రామా! శివధనుర్భంగంబునఁ గోపగించిన యీ భార్గవుని కుఠారము నీకంఠ మలంకరింప వచ్చుచున్నది. చూడు' మన,

రాముఁడు 'ఓహో! మహేశ్వరుఁడు తనయొద్ద వేయేండ్లు శిష్యుఁడవుగా నున్న నీకుఁ గార్తికేయుని జయించినతఱి నొసంగిన పరశు విదియా!' యని భావగర్భితముగాఁ బలికెను.

ఆమాట విని భార్గవుఁడు 'ఆహా వీనిసంభాషణము చిత్రముగా ధైర్యగాంభీర్యశౌర్యములను జూపుచున్నదే' యనుకొని 'ఓరీ! ఔను. నాగురువర్యుఁడగు శ్రీకంఠుఁ డొసంగిన గండగొడ్డలి యిదియే' యని పలుక, రాముఁడు 'ఇందుకా యీగర్వము? ఏమి సంతోషము?' అని తలంచి 'మునీంద్రా! మేలు, దీని చేతనే కదా నీగురునకు ఖండపరశు వనియు నీకుఁ బరశురాముఁ డనియుఁ బేరు వచ్చినది? దీననే కదా నీ కీర్తి భూమ్యాకాశముల నిండినది? ఇదిగాక నీకుఁ దండ్రియా? జమదగ్నిమహర్షి, గురుఁడా! యీశ్వరుఁడు, నీ శౌర్యమా! జగద్విదితము,నీదానమా! చతుస్సముద్రపరివేష్టితభూతలము,నీతపోబలమా! నిరుపమానము, నిన్నేమని పొగడఁదగును?' అని ప్రశంసింప, నమ్ముని 'కుమారా!నీసౌజన్యముచూడ నాఱొమ్ము నిన్నుఁ గౌగిలింపఁ గోరుచున్న' దనియెను. దానికి రాముఁడు 'తాపసోత్తమా! ఆలింగన మిపుడుతగ'దని ధైర్యముగా నుడువ, నతండు తనలో 'నాహా! యితఁడు నన్ను సర్వవిధముల ననాదరించుచుండె. చూడఁగా నితఁడు మానవజన్మమెత్తిన ధనుర్వేదమో, బలరాశియో, పుణ్యపుంజమో, శౌర్యసారమో, కాని సామాన్యుఁడు గాఁడు' అని తలంచి, సరియే సంగరమునకు రమ్ము' అని పిలిచెను. ఈ ప్రసంగ మంతయు మఱుఁగుననుండి వినుచున్న సీతయు నామె సఖులు నీ వార్త జనకునకుఁ దెలుప నేగిరి. రాముఁడును సదర్పంబుగఁ గానిమ్మని హెచ్చరించె. ఆ మాట విని పరశురాముఁడు కన్నుల నీరువెట్ట, రాముఁ డది

గని, 'మహాత్మా! ఏమి విచారించెద'వని యడిగెను. ఆమాట కతండు 'రాజకుమారా! నీవు క్రొత్తగాఁ బెండ్లియయిన ముద్దుల కుఱ్ఱఁడ వైనను గురుధనుర్భంగమున నన్నవమాన పఱచిన వాఁడ వగుటచే వధ్యుఁడ వైతివిగదా యని దుఃఖించుచున్నాఁ డ'నని బదులిడ, శ్రీరాముఁ 'డయ్యా! మీదయ నే నెఱుఁగుదును. నిజముగా మీరు భూతదయ గలవారలే' యని సోల్లుంఠనముగాఁ బలికె. అద్దాని కమ్ముని కోపించి 'ఓరీ మూఢా! ఏమో పిన్నవాఁడ వనియూరకుండ నీపలుకులు ములుకులవలె నాటుచున్నవే! తండ్రియానతిచేఁ దల్లిని నఱికితి నని వన్నెకెక్కిననాకు నీ వాక్కు లెక్కయా? ఇదిగాక గర్భములోనిపిల్లలతోఁగూడ నిరువదియొక్కమాఱు రాజవంశంబు మొదలంట నఱికి వారిరక్తమున మునిఁగి దానిచేఁ బితృతర్పణము గావించిన నాకు దయ యెక్కడిది? రమ్ము. విల్లెక్కిడి ముందుగా నాపయి బాణము ప్రయోగింపు' మని చిందులు ద్రొక్కుచున్నంతలో జనకశతానందు లచ్చోటికి వచ్చి 'రామభద్రా, నిర్భయంబుగ నుండు' మని ధైర్యము సెప్పిరి.

అంత భార్గవుఁడు శతానందుని జూచి 'మునీంద్రా! కుశలమా' యని యడిగి 'ఆ! నీదర్శనంబున మఱియుఁ గుశలము. ఆతిథ్యము గోరి వచ్చితివేని యర్ఘ్యపాద్యాదులు సిద్ధముగానున్నవి. కైకొమ్ము' అని యతండు బదులు సెప్ప ''జనకచక్రవర్తి యుత్తమచరితుఁడు బ్రాహ్మణప్రియుఁడు నని యెఱుంగుదును గాని నే నాతిథ్యము గోరి వచ్చినవాఁడను గాను' అని గర్వముతోఁ బలికెను. అందునకు శతానందుఁడు 'రాజమర్యాదలకు భంగము గలుగునట్లుగా నీ వంతఃపురముఁ జొచ్చుట పాడి గాదు సుమీ' యని పలుక 'నడవులలోఁ దిరుగు

నాకు రాజగృహవ్యవహారంబు తెలియదు' అని బదులు...
అంతలో నొక పరిచారికుఁడు వచ్చి 'దేవా! యం...
కాంతలు కోరములు విప్పుటకై శ్రీరామచంద్రుని దోడ
రమ్మనిరి' అని విన్నవించె. అది విని జనకశతానందులు 'రా
భద్రా! మీయత్తలు పిలుచుచుండిరి గాన వెళ్ళు' మన నతండు
'భార్గవా! గురువు లిట్లాజ్ఞాపించుచున్నారు, పోయివత్తునా?'
యని యనుమతి నడిగి, యతండు 'మంచిది, లోకాచార మను
సరింపఁదగిన దే కాని యడవుల నుండువారు జనపదములలోఁజిర
కాల ముండ లేరు. కాలవిలంబనమాత్రము తగ' దని చెప్ప
రాముఁ డట్లే చేసెద నని వెళ్లెను. పిదప సుమంత్రుఁడచ్చోటికి
వచ్చి వసిష్ఠవిశ్వామిత్రులు పిలుచుచుండి రని చెప్పి జనకశతా
నంద పరశురాములను దోడ్కొనిపోయెను.

తరువాత మునులును రాజులు నొక్కచో సభ చేసి
కూర్చుండియుండగా వసిష్ఠుఁడు 'భార్గవా! ఏల యీ వృథా
కలహము! పుణ్యాత్ముఁడును సూర్యవంశరాజు నగు దశరథుఁడు
నిన్నభయము గోరుచుండె. కావున యుద్ధప్రసంగము విడిచి
పెట్టి జనకచక్రవర్తి చేయునాతిథ్యముఁ గైకొని సుఖంబుగఁ
దపోవనమునకుఁ బొమ్ము. బ్రతికి యున్నంతకాలము నీకీయా
యుధపిశాచ మేల? వేదవేత్తవు తపశ్శాలివి నీకీయహంకార
మేల? చిత్తశుద్ధి గలిగి బ్రహ్మజ్ఞానంబు సంపాదింపుము. ఇది
మునిరాజమునులసభ. ఇందలివారందఱు నీ యాచకులు. ఈ
కుతారంబు విడిచి పెట్టుము. చిత్తశాంతినొందుము. నామాట
వినుము' అని బోధింప, జమదగ్నిసుతుఁడు 'మునీంద్రా! నీ
మాట వినఁదగిన దే. శ్రీరాముఁడు మహాశూరుఁడు కాఁడేని
నే న ట్లే చేయుదును గాని యతఁడు సామాన్యనరుఁడు గాఁడు.

గనిష్ట్రీవాఁడొనరించినపరాభవము నోర్చి యెట్లూరకుండె నని క్షలోకము నన్ను నిందింపక పోదు. కావున శత్రుమూలము పెఱికివేయక నాగురువు లగుపార్వతీపరమేశ్వరుల నెట్లుచూడఁ నగును' అని ప్రతివచనము చెప్పె. అంత విశ్వామిత్రుఁడు 'భార్గవా! నీకు గురువునందు గౌరవము గలదేని నన్నుఁగూడ గురువుగాఁ జూచి నా చెప్పెడిమాట వినుము. బ్రహ్మపుత్రులలో నివ్వసిష్ఠుఁ డొకఁడు గదా? రెండవవాఁ డగుభృగుమహర్షి నీ తండ్రి గదా? మూఁడవవాఁడగు నంగిరసునకు మునిమనుమఁడు శతానందుఁడు. వీరికంటె నీకు హితము సెప్పువారెవరుగలరు' అని వివరించి చెప్పఁగా, నతండు 'మునులారా! మీ మాట విననిదోషము పోవుటకు మహాతపస్సైనఁ జేయుదును గాని శస్త్రధారణముమాత్రము మానను. నాకు ముక్తికంటె శస్త్రగ్రహణమే మిక్కిలి ప్రియము. నేనును మీరును సపిండులమే యైనను వింటినారి తగిలి నాబుజములు కాయలుగాచినవి చూడుఁడు. ఇదియే నేను మోక్షకామినిగా నని చెప్పుచుండ నన్ను నిర్బంధపెట్టెద రేల' అని సగర్వముగాఁ బలుక, విశ్వామిత్రుడు. 'వత్సా! నే నొక్కటి చెప్పెద వినుము, ఎవఁడో యొకఁ డపరాధము చేసె నని రాజవంశ మా బాలవృద్ధము సంహరించి మరల బ్రాహ్మణుల మూలముగా క్షత్త్రియవంశ మంకురించుచుండఁ దిరిగి దాని నిర్మూలించుటకుఁ బూనినపుడు పెద్దలు నిన్ను నిరోధింపలేదా? అప్పుడు మానితివిగాదా? ఇపుడీపెద్దలమాట వినుట కభ్యంతర మేమి? యని మరల బోధించెను. ఆమాట కతండు 'మునివర్యా! నీమాట నిజము, చ్యవనుఁడు మొదలగు మహర్షులు చెప్పఁగా విని యప్పటినుండియు రాజులనఱకిన నాకుఠారమును మోదుగుసమిధలు నఱకుట

కుపయోగించుచున్నాఁడను. కాని కార్చిచ్చుచేఁగాలిన యడవి లోని చెట్లు మరలఁ జిగురుపెట్టునట్లుగా నిపు డారాజశేషము చిగుర్చుచున్నది. అందు సహింపరాని వాఁ డగురాముని జంపి నే నడవికిఁ బోయి తప మాచరించెదను. పిదప నిట్టిపాపము చేయఁబోను' అని పలుక, శతానందుఁ డత్యాగ్రహముతో 'ఓరీ! రాముని సీడ నైనఁ ద్రొక్క నీకు శక్తి కలదా? ఎల్ల మునులకుఁ దల్లి యగు జనకమహర్షి యింటియందే యిట్టియవ మానము నీవలనఁ గలిగెనేని మాతపస్సు మాబ్రాహ్మణ్యము మా బ్రతుకు నిఁకేల కాల్పనా?' యని బిగ్గరగాఁ గోపముతోఁ బలుక, విశ్వామిత్రుఁడు మేలుమేలని సంతసించె. పరశు రాముఁడును 'నీవంటితాపసుల నెందఱనో చూచితిని. నీ మహిమ నాతేజంబు నెదిరింపఁజాలదు,పోపో' మ్మనిధిక్కరించె. అంత శతానందుఁడు 'బ్రాహ్మణబ్రువా! కులాచారదూరా! తల్లిని జంపిన దుర్మార్గుఁడవు, పిల్లలఁజంపిన పాతకివి. నీ మొగ మైనఁ జూడఁగూడదు' అని నిందింప, నతఁడు 'ఓరీ, రాజపురో హితా! అహల్యాపుత్రా! ఔను, నీవు నన్నుఁ గులాచార దూరుఁడ వనఁదగినవాఁడవే' యని సపరిహాసముగాఁ బల్క, శతానందుఁడు కోపోద్దీపితుఁడై యీరాజులును మునిరాజు లును శాంతించిన శాంచింతించెదరుగాక. ఇఁక నే నూరకుండు వాఁడను గాను' అని కమండలూదకము చేతఁ బట్టి 'ఓసభ్యు లారా! వినుఁడు. ఈ క్షత్రియాంతకుఁ డగునీచుని భస్మము చేయుచున్నాఁడ' నని శాపోదకము విడుచునంతలో వసిష్ఠుఁ డడ్డముగా వచ్చి, 'మునీంద్రా! శాంతింపుము. అతిథియెడఁ గోపము తగదు' అని యాజల మపహరించెను.

పిదపఁ బరశురాముఁడు కుపితుఁడై 'ఓ సర్వక్షత్రియులారా! ఓ యుత్తమబ్రాహ్మణులారా! వింటిరా యీ శతానందుని గర్వగర్జితములు? కానిండు. నే నిపుడు రాఘవవిదేహవంశముల రూపడఁగింపఁ బూనినాఁడ. ఎవఁడైన విలుకాఁడు గాని తాపసుఁడుగాని యుండిన నెదురుగా వచ్చునది' అని మహౌద్ధత్యముఁ జూపఁగా జనకుఁడు 'ఓ భార్గవా! మిగుల గర్వించుచున్నాఁడవే. పగ లేదని యింతవఱకును బరాత్పరుని తత్త్వము నెఱింగి యానందించుచున్న మా రాజతేజ మిపుడు నీమాటలచే రేఁగి యుద్ధము చేయుమని మాధనస్సును మేల్కొలుపుచున్నది. మఱిచూడు.' మని ధిక్కరించి యెదుర్కొనియెను. ఆ మాటలు విని పరశురాముఁ డో జనకా! నీవు పెద్దవాఁడవు. యాజ్ఞవల్క్యుని శిష్యుఁడవు. వేదాంతవేత్తవు నని నిన్నుఁ బూజించుచుండ నిట్లు పైఁబడుచున్నాఁడవా' యన, నతం 'డోయీ! బ్రాహ్మణుఁడ వని నిన్ను గౌరవించుచుండ రాజుల నింత తృణీకరించుచున్నావే? ఇఁక, నేమైనను మంచిదే. కార్ముకము పట్టక తప్ప' దనెను. దానిపై నతండు 'నాకుఠారమును జూచుచుఁ గూడ నిట్లు ప్రేలుచుంటివా' యన నతండు 'వేయి మాటలేల? ఇదిగోఁ జూడు' మని విల్లెక్కు వెట్టె. అంత దశరథుఁ డడ్డము వచ్చి 'రాజేంద్రా! బ్రాహ్మణునిపై బాణము సంధించుటన్యాయమా?' యని నివారించె. అంత జనకుఁడు 'మిత్రమా! యీపాపాత్మునెడ దయ దలఁచుటయే పాడిగా' దన జామదగ్న్యుఁ 'డోరీ దురాత్మా! నన్నుఁ బాపాత్ముఁడనుచున్నాఁడవా? రారమ్ము, నీ పొట్టలోని పిల్లప్రేవు లూడఁబెఱికెద' నని గొడ్డలి యెత్తుచుండె. అంత దశరథుఁ 'డో విప్రా! మాశరీరముకంటె నెక్కుడని మేము తలంచు నీ రాజతాపసుని వ్యర్థముగా నిందించుచున్నాఁడవు.

ఇది తగదు, శాంతింపు'మన నమ్ముని 'ఓయీ! నీవుఁగూడ నొక రాజువలెనే శాసించుచున్నాఁడవే' యనిరి. అందుకాతేఁడు కినిసి 'కావుననే నీవు దండ్యుఁడవైతివి. దుర్మార్గులను శిక్షించు నధికారము గలవారు రాజులే. ఊరకుందువా! సరి, లేకున్న మేమే యూరకుండునట్లు చేయుదుము. బ్రాహ్మణు లెక్కడ? రాజధర్మమైన ధనుర్ధారణ మెక్కడ? చాలుఁజాలు' నని యదలింపఁ, బరశురాముఁడు నవ్వి 'ఔనౌను, రాజులగు మీరుండుటచేతనే జామదగ్న్యుఁడు సనాథుఁడయ్యెను,'అని పరిహసింప, నతఁడు 'సందియమేమి? వివేకహీనులై యిహపరములు రెంటిని జెడువారిని బాల్యంబున గురువు, యౌవనంబున రాజును, శాసింపఁగర్తలని యెఱుంగవా'యని బుద్ధిసెప్ప, విశ్వామిత్రుఁడు 'రాజా! బాగుగాఁ జెప్పితివి, పరశురామా! బుద్ధితెచ్చికొని నీకుఁ గల సందేహములను వసిష్ఠుని పాదముల సేవించి తీర్చికొను'మని పలికె. అంత రేణుకానందనుఁడు కోపించి 'యీశ్వరుని శిష్యుఁడ నగు నాకీముదుసలి నేర్పున దేమున్నది? ఏదో పెద్ద బ్రాహ్మణుఁడు కాని, నన్నీతఁడేవిమర్శనంబునఁ బోలు' నని నిందావచనములు పలుక, వసిష్ఠుఁడు 'నన్ను నిందించుటకు నాకు విచారము లేదు గాని యీతఁడు కారణముగా మావంశమున కవమానము గలిగెనని విచారించుచున్నాఁడ' నన, జనక దశరథ విశ్వామిత్రులు పరశురామునిఁ బలు తెఱంగుల దూషించిరి. ఆ దూషణమున నతఁడు మిక్కిలి రోషావిష్టుఁడై 'కాలవశమున నాకడుపులో డాఁగి యున్నకోపానలము మరలఁ బైకి రాఁదగిన సమయము వచ్చినది. ఇరువదిరెండవసారి యీరాజకుటుంబములఁ బరిమార్చి నా గొడ్డలి జమున కిష్టము గూర్పనున్నది చూడుఁ' డని పరశు వెత్తుచుండ, వసిష్ఠుఁడు 'వీఁడు

బ్రాహ్మణుఁ డని తలంచి యూరకుండరా' డనియెను. అంత విశ్వామిత్రుఁడు 'పరశురామా! నీయందు దయ దలఁచుటయే యింతకుఁ దెచ్చినది. నీగర్వ మణంచెదఁ జూడు' మని ధిక్కరించి పైవచ్చుచుండ, నతం 'డోరీ! నీవు బ్రాహ్మణుఁడవై తివా? నాతపస్సు నీతపస్సును గాల్చివేయఁ గలదు. అట్లుకాక రాజవా? నాగొడ్డలి నిన్ను ముక్కలు చేయఁగలదు రా రమ్ము' అని యెదుర్కొనియెను. అంతలో శ్రీరాముఁ డేతెంచి 'ఆర్యులారా! నమస్కారము. పరశురాముని నేను గెల్చెద. మీ కేల? నన్ను నియోగింపుఁ' డన, జనకదశరథాదు లంగీకరించిరి. పరశురాముఁడును నవ్వుచు 'నోరీ, రాజకుమారా! జామదగ్న్యుని గెలువఁగల నని తలంచుచున్నాఁడవా? పాపము! గెలువ లేవు. రేణుకానందనుఁడు నీ కంతకుఁడే' యన 'సరియే కానిమ్ము చూత' మని యాతనితో రణరంగమున కేగెను.

ఇంతకు మున్నే శూర్పణఖతో మాల్యవంతుఁడు విమానారూఢుఁడై వచ్చి యాకాశమున నిలిచి వీరి పోరాటమును గనియు రాముని జయమును దేవతలు పొగడుటను వినియుఁ 'బిడ్డా! చూచితివా? యింద్రాదులు శ్రీరాముని నుతించుచున్నారు. మనము తలంచినకార్య మిట్లయినది. పరశురాముఁడు పరాజితుఁ డయ్యె. ఇఁక రాముని వంచించుట కొక్కటి తోఁచుచున్నది. వినుము. తొల్లి దశరథుఁడు కైకేయికి రెండువరము లిచ్చెద నని ప్రతిజ్ఞ చేసెను. ఆ రాణియుఁ దనవరంబులు వేఁడుటకై మంథరను బంపినది. అదియు మిథిలాప్రాంతమునకు వచ్చియున్నది. నీవుపోయి దానిశరీరమునఁ బ్రవేశించి దశరథుని సమీపించి భరతుని పట్టాభిషేకమును శ్రీరాముని వనవాసమును గోరుము. రాముఁ డరణ్యములకు వచ్చె నేని సీత నపహరించి

మన కార్యము నెఱవేర్చికొనవచ్చును' అని చెప్ప శూర్పణఖ 'తాతా! లక్ష్మణుఁడు రామునకు సహాయుఁడై రాకపోఁడు. పరాక్రమవంతు లగునాసోదరులయెడ మనమాయ చెల్లుటయు నసాధ్యము. ఇదిగాక దవ్వుల నుండురాముని మనదగ్గఱకు దెచ్చుటయు నెన్నఁడును వైరము లేనివానితో స్త్రీలమూలకముగా వైరము దెచ్చుకొనుటయు నుచితములుగావు. కావున నా కీయాలోచన మంతగా మంచి దని తోఁపకున్న' దన, నతం 'డోసీ! అట్లని యెడ వేల? మన పొలిమేరవఱకు నాతని భూమి గలదు. అతఁడు తాటకాసుబాహువులఁ జంపె. మారీచుని మర్దించె. ఇఁక దూరమెట్లు? వైరము లేకుండుట యెట్లు? ఇది గాక రావణుఁడు గోరినసీత నతఁడు పరిణయంబగుటయే గొప్ప వైరకారణము. కావున మన యాలోచనము నెఱవేఱెనేని రాముఁడు దండకారణ్యమునకు రాఁగలఁడు. అపుడు మనవారు సేయు మోసమున నతఁడు సీతను గోల్పోవును. సీతావియోగమున నతఁడు ప్రాణములు విడుచును. అట్లు కాక శౌర్యము చూపి యుద్ధమునకు వచ్చునా? మన రావణునకు మిత్త్రుఁడగు వాలియే యాతని గర్వ మణఁపఁజాలును' అని చెప్పి కొంచెమాలోచించి 'అయ్యో పిల్లా! నాయాలోచన మంతకును బ్రతిహతముగా గొప్పసంశయ మొకటి గలుగుచున్నది వినుము. రామరావణులకెట్లైన విరోధము తప్పదు. ఇట్టి స్థితిలో నతినిద్రాపరవశుఁడగు కుంభకర్ణుఁ డుండినను లేనివాఁడే. విభీషణుఁడు రాజనీతి నెఱింగినవాఁడగుటచేఁ బ్రజ లాతనికి వశ్యులై యుండిరి, సత్ప్రవర్తనుఁ డగు నతఁడు రావణుని దౌర్జన్యమును సహింపఁడు. కావున నితఁడు మనకుఁ బ్రతికూలుడే కాని యనుకూలుఁడుగాఁడు. ఖరదూషణ త్రికంతులు ధనాపేక్షచే రాజు

ననుసరించుచున్నారు గాని నిజముగా వారి కాతనియెడ భక్తి లేదు. ఇంక పౌరులందఱు నిదివఱకే ప్రతికూలంబుగ వర్తించుచున్నారనుట నీవెఱింగిన దేకదా! ఈయంతర్భేదము లన్నియు నిపుడు చిన్నవిగాఁ గన్పట్టుచున్నను శత్రువు దండెత్తి వచ్చినపుడు పెద్దవియై కష్టసాధ్యము లగును. కావున ముందుగా విభీషణునిఁ జెఱలోఁ బెట్టికాని దేశాంతరము పాఱఁదోలికాని యొక బాధ తొలఁగించికొనఁదగు నని యాలోచింతునా? ఇదియును సమంజసముగా లేదు. అతని బంధించితిమేని ఖరాదులు కలహింతురు. దూరదేశమున విడిచితిమేని వీ రాతని వెంబడించి పోవుదురు. పోనిమ్ము. ఖరాదు లాతనితోఁ గూడ వెడలరని యనుకొన్నను విభీషణుఁ డెట్లయిన బుద్ధిమంతుఁడు గదా! ఇతఁడు తప్పక ఋశ్యమూకపర్వతమున కేగి తన బాల్యమిత్రుఁడగు సుగ్రీవునితోఁ గలియును. మఱియును గ్రమముగా దండకారణ్యభాగముల కేతెంచిన శ్రీరామునితో సుగ్రీవుఁడు మైత్రి చేయును. వాలిచెడ్డనడత నెఱింగిన రాముఁడు తప్పక సుగ్రీవునకే సహాయ్య మొనరించును గాని వాలిని జేరఁడు. కావున బాహుపరాక్రమశాలియగు శ్రీరాముఁడు వాలినే సంహరించును. అతఁడు నిజముగా వాలిని చంపినా; సర్వరాక్షస సంహారము గావించి తనయనుగ్రహ మపేక్షించు విభీషణునకు లంకారాజ్యము ధారవోయు ననియే నమ్మఁదగును. కావున మన యాలోచనంబు మనకే యనర్థదాయకమగునని తోఁచుచున్న'దనఁగా శూర్పణఖ కన్నీరు విడిచెను. మాల్యవంతుఁడును 'కుమారీ! విచారమేల? ఏమయిన నగుఁగాక, నీవు పోయి మంధరలోఁ బ్రవేశించి జనకవసిష్ఠవిశ్వామిత్రులు దగ్గఱనుండఁగా దశరథునికడ కేగి యువ్వరంబు లడిగి

నీపని నెఱవేర్చికొని రమ్ము. నేనును లంకకుఁ బోయెద' నని యిరువురును యథోక్తముగా నేగిరి.

అనంతరము వసిష్ఠవిశ్వామిత్రులును జనకదశరథులు నొక్కచోఁ గలిసియుండఁగా రాముని గెలుపునుగూర్చి ప్రశంసించుచు వసిష్ఠుఁడు విశ్వామిత్రుని నుతించెను. జనకుఁడును 'రామభద్రుఁడు నీ పుత్త్రుఁ డగుట నీపుణ్యము మంచి' దని దశరథుని బొగడెను. ఇట్లు వారు నలువురును ముచ్చటించుకొను చుండఁగా రామపరశురాము లచ్చటికే తెంచిరి. శ్రీరాముఁడు వినయముతోఁ బరశురామునకు వందన మొనరించి తనయపరాధమును మన్నింపు మనికోరెను. అంత జమదగ్నిసుతుఁడు 'రామా! నీ వుపకర్తవుగాని యపకర్తవు గావు. నాతపస్సునకు బ్రాహ్మణత్వమునకు భంజకం బగునామనోగర్వమణఁచి నాకుఁ జిత్తశాంతి నొసంగిన మిత్త్రుఁడవు. రాజధర్మము నెఱవేర్చితి' వని నుతించి 'ఓ తాపసోత్తములారా! ఓ రాజవర్యులారా! శ్రీరాముఁడు నాగర్వమును శాంతింపఁజేసెను, కాని మొదట మీమాట విననిదోషము మాత్రము నన్నుఁ జుట్టుకొని యున్నది. దీని కేదయినఁ బ్రతిక్రియ యొనరించి నన్ను రక్షింపుడు. ఓ వసిష్ఠా! నా దోషశాంతి కేదయిన శిక్ష విధింపుము' అని వేఁడుకొన, వసిష్ఠవిశ్వామిత్రులు 'నీకుఁ బశ్చాత్తాపముఁ గలుగుటయే చాలును; నీవు పావనుఁడవైతివి. నీ తపస్సు ఫలించుఁగాక' యని యూఱడించిరి. రాజులును 'మునివర్యా! నీవు స్వయముగాఁ బవిత్త్రుఁడవు. నీ కన్యులు పావనత నీయ నక్కఱలే' దని పొగడిరి. అంత భార్గవుఁడు నిర్మలచిత్తుఁడై 'తల్లీ వసుంధరా! కొంచె మెడ మిచ్చి నన్ను నీలో నణఁచికొను' మని ప్రార్థింప, వా రందఱును గొంచెము నేవు దయచేసి కూరు

చుండు మని కోరిరి. అట్లుండలు నుపవేష్టించిన తరువాత దశర థుఁడు 'భార్గవా! సర్వసంగపరిత్యాగము చేసి యడవులఁ దపం బొనరించు మీవంటి పుణ్యాత్ములదర్శనముచే గృహస్థుల మైన మాజన్మము సఫలమైనది. స్తోత్రముల కుపూంగని ని న్నేమని నుతింతును? సర్వభూతలము దానముచేసిన నీ కేమియొసంగఁ దగును' అని ప్రశంసింప, నతండు 'రాజోత్తమా! గురువులకు గురువైన మైత్రావరుణుఁడు నీకు గురువు. నీవు దేవాసురయుద్ధ మున నింద్రునకు సహాయుఁడవయిన పరాక్రమశాలివి. సమస్త సంపదల విలసిల్లువాఁడవు. నిన్నేమని పొగడుదును? కావున నా కనుజ్ఞ యిమ్ము. వనంబునకుఁ బోయెద' ననియెను. విశ్వామిత్రుఁ డును వసిష్ఠునితోఁ "దాపసోత్తమా! మనముగూడ రాజుల యానతిఁ గైకొని సిద్ధాశ్రమంబున కేగుద" మనియెను. అంత నందఱును లేచినపిదపఁ గౌశికుఁడు శ్రీరాముని గౌఁగిలించుకొని 'రామభద్రా! నిన్ను విడిచి పోవుటకుఁ గాళ్లాడ కున్నవి గాని యగ్ని హోత్రనిర్బంధము త్వర పెట్టుచున్నది. నీవు చిరంజీవివై యశోధనుఁడవుక'మ్మని దీవించెను, వసిష్ఠుఁడును యథోక్తముగా దశరథాదుల దీవించినపిదప వా రిరువురును సిద్ధాశ్రమంబునకుఁ బయనమైపోయిరి. భార్గవుండును రాజుల యనుజ్ఞఁ గొని శ్రీరా ము నావలకుఁ గొనిపోయి 'రామా! సమిధలు నఱకికొను టకు గొడ్డలి నాయొద్ద నుండఁదగును గాని యీవింటితో నా కిపు డేమియుఁ బని లేదు. దీని నీవు తీసికొని దండకారణ్య మునను బుణ్యనదీతీరంబులను వసించియున్న రాక్షసుల సంహ రించి యందలి మునులకు బాధ లేకుండఁ జేయు' మని తనశరా సన మతని కొసంగి తపోవనమున కేగెను. రాముఁడును దానిం గొని మునులు వెడలుట మనంబున విచారించుచు 'నే నెవ్వి

థంబున దండకాటవి కేగుదును' నాగమనంబునకుఁ బెద్ద
లె ట్లంగీకరింతురు? అక్కటా? రక్కసులబాధ లేకుండఁగ
మునుల రక్షించుట యెట్లు' అని తలఁచికొనుచున్నంతలో
లక్ష్మణుం డచటికి వచ్చి, అన్నా! మధ్యమాంబ యగు కైకేయి
నియోగంబున నయోధ్యనుండి మంథర నిన్నుఁ జూడ వచ్చి
నది' యని చెప్పఁగా, నతఁడు సంతసించి రాని మ్మనెను.
అంత మంథరావేషధారిణి యగు శూర్పణఖ 'ఆహా! యేమి
యీతని సౌందర్యము! వీనిం జూచినచోఁ జిరకాలంబుగ
సంసారసౌఖ్య మెడఁబాసిన విధవలకుఁగూడ మనంబు చలిం
పక మానదు' అని యాలోచించికొనుచు రాముని సమీపింప,
నతఁడు 'మంథరా! తల్లి కిఁగుశలమా' యని యడుగ నదియుఁ
'గుశలమే, ఇదిగో మీతల్లి యిచ్చినపత్రిక'యని చేతికిచ్చెను.
దానిని సౌమిత్రి గ్రహించి 'తొల్లి యమ్మహారాజు ఒసంగిన
రెండువరంబులలో నొకటి భరతుఁడు పట్టాభిషిక్తుఁడై రాజ్య
మేలుట, రెండవది నారచీరలం గట్టికొని శ్రీరాముఁడు సీతా
లక్ష్మణులతోఁ బదునాలుగేండ్లు వనవాసము చేయుట' యని
యాజాబులోని విషయము చదివి, 'ఆహా! పాపాత్మురాలా!
యీజాబు వ్రాయ నీకుఁ జేయి యెట్లాడె' నని మనంబునఁ
గుందుచుండె. రాముఁ డావార్త విని 'తల్లీ! యేమి నీయను
గ్రహము? నాతలంపునకుఁ దగినట్లుగా వరము లడుగుచు
నాతమ్మునినా ప్రియపత్నిని విడువనక్కఱ లేకుండఁగా జేసిన నీ
యనురాగంబు నేమని నుతింతు'నని ప్రశంసించి, 'మంథరా!
మాతల్లి నియోగము నిపుడే నెఱవేర్చెదనని చెప్పుము,
పొమ్ము, అని దానిం బనిచెను. అంత సౌమిత్రి భాతృవియో
గము లేమి కానందించి 'అన్నా చూచితివా! మేనల్లుఁ డగు

మనభరతునితోఁ గూడఁ యుధాజిత్తు తండ్రిగారియొద్దకు వచ్చుచున్నాఁ'డని చూపెను. అంత యుధాజిత్తు దశరథుని సమీపించి నమస్కరించి 'దేవా! జనులందఱు నేకగ్రీవముగా శ్రీరామునిపట్టాభిషేకమును గోరుచున్నారు కావున నట్లు కావింపు'మని విన్నవింప, నతండు వసిష్ఠుఁడు వెళ్ళిపోవుటకుఁ గొంచెము వగచి 'వారిట్టికార్యంబునకు మాఱుపలుక'రని జనకుఁడు చెప్పఁగా సంతసించి 'అట్లయినచో మిత్రమా! యభిషేకసంభారముల నొడఁగూర్పుమని సుమంత్రునితో జెప్పెను. ఈమాటలు వినుచున్న రాముఁడు వారల సమీపించి 'నాయనా! తొల్లి నీవు మారెండవతల్లికిచ్చిన వరముల నిప్పు డామె గోరుచున్నది. సత్యసంధుఁడ వగు నీవావరము లీయ నిన్ను వరమడుగుచున్నాఁడ'నని విన్నవింప నతండు 'కుమారా, సంశయమేమి, కోరు'మని యెను. అంత రాముని యనుమతిచే సౌమిత్రియుఁ గైకేయి కోరిన పూర్వోక్తవరంబులఁ జదివి వినిపించెను. అది విని దశరథుఁడు 'హా రామా! హా కుమారీ జానకీ! హా లక్ష్మణా!' యని మూర్ఛిల్లి పుత్రు లెంత యుప చారము చేసినను దెలివి చెందకుండె. జనకుఁడును బుత్త్రిని జామాత నెడఁబాయుటకు దుఃఖించుచు 'హా రామభద్రా! హా లక్ష్మణా! రఘువంశరాజులు తమపుత్త్రులపై రాజ్యభారముంచి చేయు వనవాసవ్రతము మీకుఁ జిన్నతనముననే లభించి నదా! హాతల్లీజానకీ! పెద్దలయనుమతిచేనీకు భర్తకుపచారము సేయు భాగ్యమబ్బినదా' యని మూర్ఛిల్లె. అంత రాముఁడు, 'లక్ష్మణా! పెద్దప్రాణములు రెండును సొమ్మసిల్లినవి. మనము చేయఁదగిన దేదియుఁ గనఁబడదు. భరతునితల్లి మనము జాగు సేయుట సైరింపదు. కావున మనము వారియందలి భక్తిచే

విలపించుచుఁ జేయఁదగిన దేమున్నది? శీఘ్రముగా వెళ్ళి జాన కిని గొనిరమ్ము' అని యానతీయ నతం డట్లు వెడలెను.

పిదప భరతుఁడు తన మేనమామనుజూచి, 'ఏమయ్యా, మీయింటి కిట్టి యపకీర్తి రాఁదగునా' యన, నతం 'డయ్యో యేమి సేయుదును? నాకు మతి పోయినది. బావ పరలోక యానము సేయనుండె. బాలు రరణ్యములకుఁ బోవ నుండిరి. సీత రక్కసులపాలు గానున్నది, అక్కటా? కైకేయిమూల ముగా మాకపకీర్తి వచ్చినది' యని పరితపించుచుండె. ఇంత లో లక్ష్మణుఁడు వచ్చి 'అన్నా! పూజ్యారాలిం గొనివచ్చితి' నన, నతండు రండిటు రండని వారితోఁ గూడి యా పెద్దల కుఁ బ్రదక్షిణ మొనరించి 'మామా! ఈ పెద్దలను మాతల్లు లను మాతమ్ములను నింకను దక్కినవారిని నీవు పోషింపుము. మే మడవికిఁ బోవుచున్నార' మని పయన మయ్యెను. అంత యుధాజిత్తు భరతునితోఁగూడ రాముని వెంబడించి 'రామా! యడవులలో నీపాదసేవ చేయుచు నుండుటకు భరతునిరాక గూడ నంగీకరింపు' మన, నతండు 'మామా! యితనిని వర్ణా శ్రమధర్మములు రక్షింపఁ బెద్దలు నియోగించిరి. పెద్దలయానతి నతిక్రమించుట తగునా?' యన, భరతుఁడు మాఱుతోఁపక మామచేఁ దెలుపఁబడి, 'అన్నా! అట్లయిన శరభంగముని నీకుఁ బంపినపాదుకలు నాకు దయసేయు' మని కోరె. శ్రీరా ముఁడును వాని నొసంగ భరతుఁ డాపావలు శిరమునఁ బూని 'ఆర్యా, నే నీపాదుకలకుఁ బట్టాభిషేకము చేసి జటావల్క లాజినములు ధరించి నందిగ్రామమున నుండి నీరాక కెదురు చూచుచు రాజ్యపాలన మొనరించుచుందును' అని సీతారా ములకుఁ బ్రదక్షిణము చేసి నమస్కరింప' వారును దీవించి

'భరతా! పెద్దలను సేవించుచుండు' మని చెప్పి వనమార్గము పట్టిరి. భరతుఁడు దండ్రికడ కరుదెంచెను. యుధాజిత్తు రాముని మరల వెంబడించి 'రామా! నన్నుఁగూడ రానిమ్ము. నేనొక్కఁడనే కాను. సాకేతపురములోని బ్రాహ్మణు లా బాలవృద్ధము తమతమ నిత్యాగ్నిహోత్రములను వాని సాధనములను బట్టుకొని వచ్చుచున్నారు చూడు' మన నతండు 'మామా! నన్ను మన్నించి నీ వీమహాజనంబును వెను కకు మరలించి కొనిపొమ్ము. పిన్నలకు ధర్మలోపము రాకుం డఁగఁ గాపాడుట పెద్దలపని గదా' యన నతండు మాఱు పలుకక మరలి 'ఓరామా! ప్రతియుగమును బండితపామరు లెల్లరు ప్రతిదిన ముదయముననే లేచి కాలకృత్యములఁ దీర్చి కొని పాపహారమైన నీ కథను బారాయణము చేయుదురు గాక' యనుచుఁ బౌరులతో వెనుకకువచ్చెను. అంతనిచ్చట జనకదశరథులు తెలివొంది రామునిగమనము విని మహా దుఃఖమున విలపించుచు భరతునిచే గృహంబునకుఁ దీసికొని పోఁబడిరి. అంత నక్కడ లక్ష్మణుఁడు 'అన్నా! శృంగిబేరపుర రాజును నిషాదప్రభువును నగు గుహుఁడు తనసీమ నాక్రమిం చిన విరాధుని దౌర్జన్యమును విన్నవించెను గదా' యన, రాముఁడు 'కానిమ్ము. ముందుగా భాగీరథీపరివేష్టితంబై ప్రయాగకు సమీపమందున్న పుణ్యక్షేత్రం మగుచిత్రకూటం బున కేగి యందలి తాపసులకు బాధ గలిగించు రక్కసుల నుక్కడగించి వింధ్యాటవీ ముఖంబున నున్న విరాధునిఁ బరి మార్చి తరువాత దండకారణ్యమున కరిగి క్రమముగా జటాయువు నివసించియున్న జనస్థానంబున కేగుద' మని యట్లు వెడలె.

ఇట్లు వీరు వనసంచార మొనరించుకాలమున వీరి వృత్తాంత మరయుచున్న జటాయు వనెడు గృధ్రరాజు కావేరీ నదిచేఁ జుట్టఁబడిన మలయపర్వతమున కరుదెంచి తనయన్న యగు సంపాతిని జూచి నమస్కరింప నతండు సంతసించి తమ్ముని గౌఁగిలించుకొని 'వత్సా! గరుత్మంతునిఁ గన్న మనపితామహి యగువినతవలెనే నిన్నుఁగన్న మనయమ్మ యగుశ్యేని పేరు వడసినది' యని కొంత ముచ్చటించి 'తమ్ముఁడా! యిపుడు కాలవిశేషమువలన రామభద్రునకుఁ దండ్రిపోయినవిచారము తగ్గినది సుమీ' యని నుడివెను. జటాయువు నమ్మాట విని 'అన్నా! అది నిజమే. మునులను బరిపాలించుటయుఁ బెద్దల సహవాసము, ధైర్యముననునవియాతనిపితృశోక మపహరించె ననిన నాశ్చర్య మేమి?' యన, సంపాతి మెచ్చికొని 'తమ్ముఁడా! యతఁడుచిత్రకూటమువిడిచిశరభంగునియాశ్రమమునకువచ్చె ననియు నతనిఁజూచినపిదప శరభంగమహాముని యగ్నిప్రవేశ మొనరించె ననియుఁ బిదప రాముఁడు మఱియొకమునియాశ్రమమున కేగెననియు విరాధునిమాంసముకంతపూర్తిగాఁ దినిన యొకగ్రద్ద నాకుఁ జెప్పిన' దన, నతండు 'సోదరా! అవును. రామచంద్రుఁ డిపు డగస్త్యుని యానతిచేజనస్థాన మందలి పంచవటియందు నివసించి యుండె' నని చెప్పె. అంత సంపాతి కొంచె మాలోచించి 'నాయనా! పెద్దవాఁడ నగుటచే మొదట జ్ఞప్తివచ్చినది గాదు. ఇపుడు తెలిసినది. అవును, గోదావరీతీరంబునఁ బంచవటి యున్నది. కాలవశమున నిట్లయితిని గాని మున్ను నే నీప్రపంచమంతయుఁ [illegible] గానా?' యని తన యశక్తతకుఁ గొంత వగచి 'సోదరా! యురి దలివార్త లేమయిన వింటివా?' యన, "అయ్యో! వార్తలు

లేకయేమి? వినుము. ఒకనాఁడు రాఘవుని వరింప శూర్పణఖ యచ్చటికి వచ్చినది. లక్ష్మణుఁడు దాని దౌర్జన్యము గని పెట్టి యున్న సెలవుపొంది దానిని ముక్కుఁ జెవులను గోసిపంపెను. అంత నిది తెలిసి పదునాలుగు వేల పదునలుగురు రక్కసుల తో ఖరదూషణత్రిశిరులు రామునిపై దండెత్తిరాఁగా నతండు వారి నెల్లరను సంహరించెను' అని వినిపింప, సంపాతి యాశ్చ ర్యపడి 'వత్సా! రామరావణులకు గొప్పవైరకారణము పొడ మినది. ఇఁక నీ వొక్కనిమిసమైనను సీతారామలక్ష్మణులను విడిచి యుండకుము. నేనును సముద్రమున స్నానము గావించి రామునకు శుభము కలుగ ధ్యానము చేయుచుందు' నని చెప్పి వెడలెను.

అంత జటాయువును గగనయానంబునఁ బంచవటి సమీపించి చూచి, 'ఆహా! ఏదో యొక మాయామృగమును వెంబడించి రాముఁడు కడుదూరము పోయెను. అయ్యో! సౌమిత్రి గూడ నాతనికై పోవుచుండెను. అక్కటా! యెవఁడో సన్యాసి పర్ణశాలలోఁ బ్రవేశించుచుండెనే' యని పరిశీలించి చూచి 'అవురా! యెంత ప్రమాదము! వీఁడు నిజముగా రావ ణుఁడే. కటకటా! ఈ దుర్మార్గుఁడు గాడిదలరథముమీఁద నెక్కించి సీతను దీసికొని పోవుచుండె' నని చింతించి ధైర్య ముతో 'ఛీ! దుర్భాగ్యా! పౌలస్త్యా! ఉండు ముండుము. నీకడుపు బ్రద్దలుచేసి ప్రేవు లూడఁబెఱికెదఁ జూడు' మని కేకలు వైచుచు రావణుని సమీపింప నతివేగముగాఁ బోయెను.

అంత నిక్కడ రామలక్ష్మణులు మారీచునిఁజంపివచ్చి యుటజంబున సీతను గానక దుఃఖించుచుఁ గాననంబున నిటు నటువెదకుచు నెందునుం గానక పరితపించుచు సీతను దలఁచి

కొని విలపించుచు నడుమనడుమ ధైర్య మవలంబించుచు నెట్టకేలకు రావణజటాయువులు యుద్ధ మొనరించిన స్థలంబును సమీపించినంత లక్ష్మణుఁడు 'హాతల్లీ సీతా! యెచ్చటనున్నదానవు? మాయ లేడియగుమారీచునివలనమాయన్న కష్టమనుభవించుచున్నాఁడు. ఈతనిదుఃఖమును నీవుమాన్పవుగదా' యని విలపింప, రాముఁడు 'హా ప్రేయసీ! సీతా?' యని పేర్కొని ధైర్యమువిడిచి రోదనము చేసె. అంత సౌమిత్రి 'అన్నా! నీయట్టిలోకోత్తరు లాపదలయందు ధైర్యము విడుతురా' యన, రాముఁడు 'తమ్ముఁడా! యేమిచేయఁదగును? సీత నెడఁబాయుటయే మనంబును దహించుచుండ నింతకంటెను దీవ్ర మయి యన్యుఁ డాసతి నపహరించె ననెడి యవమానము శూలమై హృదయము నాటుచున్నది. దీనిఁగూడ మించి యీ జటాయువుమరణము మిక్కిలి వెత గలిగించుచున్నది' యనుచు, 'హా తాతా! శకుంతరాజా! నీబోఁటి మహాత్మునిపొందు మాకింక నెక్కడ సంభవించు' నని జటాయువును దలఁచికొని విలపించె. అదివిని సౌమిత్రి 'అన్నా! జటాయువు చరమదశనింకను జూచుచున్నట్లేయున్నాఁడను. 'అకటా! రామా! నీవు వెదకుచున్న పరమౌషధివంటి నీదేవిని నాప్రాణములను గూడఁ బాపాత్ముఁ డగుదశగ్రీవుఁ డపహరించె'నని పలుకుచు నాజటాయువు వీరస్వర్గమున కేగుట నాకన్నులకుఁగట్టినట్లే యున్న'దన, రాముఁ 'డక్కటా! యీగాథ చెప్పికొనుట బాధకే కాని యింకఁ బ్రయోజనము లేదు. మనలఁ బరాభవించిన యా దుష్టరాక్షసునకుఁ దగిన ప్రతిక్రియ సేయుటయే మనపని. దండకారణ్యమందలి రక్కసుల సంహరింపఁ దలఁచి వచ్చిన మన కార్యము శత్రువగుదశగ్రీవునిదుంప పెఱుకుటతో సమాప్తము

గాఁగల దని ప్రతిన యొనరించి గృధ్రరాజున కగ్నిసంస్కారము గావించి పంచవటి వీడ్కొని జనస్థానంబునకుఁ బశ్చిమంబుగానున్న క్రౌంచవంతమనెడి దండకారణ్యభాగముదారి వట్టిరి.

ఇట్లు వారిరువురుఁ బోవుచుండఁగా 'హా! దుర్మార్గుఁడగుదనుకబంధుఁడు నన్నుఁదినుటకు లాగుచుండె. నేను మతంగాశ్రమమునుండి శ్రీరాముని వెదకుటకు వెడలుచున్న శ్రమణయనుదానను. మహాత్ములారా! రక్షింపుఁడు రక్షింపుఁ' డని యొక యార్తధ్వని వినిపించె. దాని విని, రాముఁడు 'తమ్ముఁడా! శీఘ్రముగా వెళ్లి యామెను గాపాడు' మని పంప, నతండు పోయి వానినిసంహరించి శ్రమణతోఁగూడి మరలివచ్చె. అంత శ్రీరాముఁ డాశ్రమణను జూచి 'ఏమమ్మా! మమ్ము వెదక నీకేమి పని' యని యడుగ, నామె 'మహాత్మా! రావణుని తమ్ముఁడు నీవు ఖరాదులను జంపినవార్త విని నపుడే యేదో యొక కారణంబున నిల్లు వెడలివచ్చి సుగ్రీవునితో మైత్రియొనరించి ఋశ్యమూకపర్వతమున నివసించియున్నాఁడు. అతండు నీకై యిచ్చినపత్రికయిదిగో' అని చేతికిచ్చె. దాని నతనియొద్దనుండి లక్ష్మణుఁడు తీసికొని 'శ్రీరామచంద్రమూర్తికి నమస్కరించి విభీషణుఁడు విన్నవించుదేమనఁగా, దైవబలము లేనివారికిధర్మమును, సత్త్వమూర్తివగునీవును దక్క మఱియొక గతిలేదు. కావున నాకు నీవే రక్షకుఁడ' వనెడి యాజాబులోనిమాటలు చదువఁగా, రాముఁడు 'తమ్ముఁడా చెలికాఁడును లంకారాజునగు నవ్విభీషణునకుఁబంపఁదగిన ప్రత్యుత్తరమేమి?' యని యడిగి యతం 'డన్నా? నీ విపు డన్నమాటయే యతనికిఁ బ్రత్యుత్తరము కాఁగలదనఁగా, శ్రమణతో 'సరియే సౌమిత్రి చెప్పినట్లుగా నాతనితోఁ జెప్పుమనె. ఆమెయు మహా

ప్రసాద మని 'ఆర్యా! నీచుఁ డగు రావణుఁడు సీతను గొని పోవుచుండఁగా జాటి క్రిందఁ బడిన యనసూయ పేరుతో నున్న యుత్తరీయమును సుగ్రీవ విభీషణ పవనాత్మజులు తీసిదాఁచి యుండి' రని విన్నవింప నతం డించుక విచారించి, 'ఆహా! నిర్హేతుకమిత్రులగువారిని జూచుటకంటె మనకుఁ గర్తవ్యమేమి? అచ్చటికే పోదము రం' డని వారితో ఋశ్యమూకమునకు బయలువెడలెను.

వారిట్లు కలిసి మాటలాడుకొనుచుఁ బ్రసంగవశంబున హనుమంతునిపౌరుషమును గూర్చి ప్రశంసించికొనుచుఁ బోవు చుండఁగా దారిలో నొకపురుషుఁడు డెదురువచ్చి 'రామా! జయము జయము' నేను లక్ష్మీపుత్త్రుఁడను. నాపేరు దనుఁడు. శాపవశంబున రాక్షసుఁడ నైతిని. ఇంద్రునిచేఁ గబంధుఁడ నైతిని. మహాత్మా! మీ కపకారము చేయుటకై నేను మాల్యవంతునిచేఁ బంపఁబడియు నీ యనుగ్రహమ్మున దేవత్వము నొందితిని. నేను దరించితిని. నీకొక్కమాట సెప్పెద వినుము. మిమ్ము సంహరింప మాల్యవంతుఁడు వాలిని బురికొల్పుచుండె. అతఁడును రావణునియందలి ప్రీతిచే మిమ్మెదుర్కొన సంత సించుచుండెను. ఇదియే నామాట; నాకు సెలవిమ్ము' అని చెప్ప రాముఁ 'డోయీ! మంచివార్త చెప్పితివి చాలును. నీవు పుణ్య లోకంబున కేగు' మన నతం డంతర్హితుఁడయ్యె. అంత సౌమిత్రి వాలిరావణుల కెట్లు స్నేహము గలిగిన దని శ్రమణ నడిగి, "కైలాసపర్వత మెత్తితి ననియుఁ ద్రిలోకవీరుల గెల్చితిననియు గర్వించి రావణుం డొకసారి వాలిని మల్లయుద్ధమునకుఁ బిల్వ నవ్వానరవీరుఁ డతనిఁ జంకఁ బెట్టికొని యేడుసముద్రములు ద్రిప్పె. అపుడు పౌలస్త్యుఁడు 'మహాత్మా! నన్ను క్షమింపు'

మని జోహారు సేయ నాఁటినుండియు నతఁ డాతనితో మైత్రి గలిగి యుండె' నని యామె చెప్ప, 'ఓరీ రాక్షసాధమా! నీ పరాక్రమ మింతటిదా?' యనియెను. రాముఁ డీల్లే లోకంబున నొకని మించి యొకఁ డుండు ననుచు ముందు చూచి 'శ్రమణా! యీ కనఁబడుపర్వతము పేరేమి?' యని యడిగెను. 'అయ్యో! యిది గిరి కాదు. వాలి చంపిన దుందుభిరాక్షసుని యెముకల ప్రోగు' అని యామె చెప్ప నతం 'డోహో! అదియా యిది?' యనుచు సమీపించి కాలిబొట్టనవ్రేలితో దానిఁ దన్ని దూరముగా విసరివైచెను. దానిం గని శ్రమణ 'ఆహా! మున్నొక నాఁడు వాలి యీ యస్థిరాశిని రెండుచేతులతో నెత్తి యిచ్చటికి విసరి యిదియే యెంతోదూర మని సంతసించెను. దానిఁ బాదాంగుష్ఠమునఁ గడుదవ్వుగాఁ బడవైచిన నీబలదర్పం బే మని నుతింతు' నన, సౌమిత్రి 'శ్రమణా! మన మిపు డెచట నడచుచున్నార' మని యడిగెను. 'ఇది ఋష్యమూకమునకును పంపానదికిని నడుమ నుండు ప్రదేశము. ఈముం దున్నది మతంగాశ్రమము. ఇం దిపుడు మునులు లేకున్నను యజ్ఞపరికరములు ప్రక్కల నుండ వైశ్వానరుఁడు ప్రజ్వరిల్లుచునే యుండెను. మఱియుఁ జూచితిరా! యీ ప్రవహించునదులు? వాని ప్రక్కనున్న తోఁపులలో నేనుఁగులు నెలుఁగులు యథేచ్ఛముగాఁ దిరుగుచుండెఁ గనుఁగొంటిరా' యని యామె నుడువ, రాముఁ డవ్వనంబులు చూచి కన్నీరుగార్చుచు విల్లు మ్రోఁగించి ధైర్యమవలంబించి నిలువఁబడెను. అది చూచి సౌమిత్రి 'యే మిది?' యనునంతలోఁ బచ్చనిమైచాయయు మెడలో బంగారుతామరలదండయుఁ గలుగఁ బెద్ద నడగొండవలె వాలి యెదురు వచ్చుచు 'నక్కటా! రావణునియందలి యనురాగముచే నిట్టి

పాపకృత్యమున కొడఁబడితిని. తెల్లవాఱినది మొదలుగా మా ల్యవంతుఁడు బతిమాలుచు నెట్టకేలకు నన్నుఁ గిష్కింధనుండి వెడలించెను. భార్యావియోగమున దుఃఖించుచు మా భూమికి వచ్చెడి యాపుణ్యాత్ముఁడైన రాముని కతిథిసత్కారము గావిం చుటకు బదులుగా నిట్టి పాడుపని చేయుటకు సిద్ధపడుచున్నాఁడ. అయ్యో! దుర్జనస్నేహ మెట్టిపని నైనఁ జేయించును గదా! ఏమి చేయుదును? ఇఁక విచారించినఁ బ్రయోజన మేమి? సుగ్రీవు నకుఁ జెప్పకయే విభీషణుఁడు శ్రమణను రామునొద్దకుఁ బంపె ననియు నతఁడును మతంగాశ్రమము ప్రక్కకు వచ్చి యుండె ననియు నిపుడే చారులు చెప్పిరిగదా? అతఁ డిక్కడనే యుండు' నని తలంచికొనుచు వీరిని సమీపించి 'ఎవఁడిక్కడ? పరశు రాముని గెల్చిన శ్రీరామునిఁ జూడవచ్చితిని. అతనిఁజూచి నా కన్నుల కానందము గలిగించుకొని నాబుజములతీఁట తీర్చికొన నెంచితిని. ఈ బ్రహ్మాండము నెడువృక్షము నొక్క మాఱుగాఁ బెకికి వేయ సిద్ధపడునాకు మొలత్రాడు గట్టికొనిన మగవాఁ డెవఁ డయినఁ గలఁడేని యెదురువచ్చుఁగాక' యని పలుకుగర్వోక్తులు విని రాముఁడు 'తమ్ముఁడా! నేనిచ్చట నున్నాఁడ నని చెప్పు' మనెను. ఆమాట విని వాలి మిక్కిలి డాసి 'మహాత్మా! నీవా రఘువీరుఁడవు. ఆహా! ఆనందమునకో విచారమునకో యాశ్చ ర్యమునకో నేను నిన్నుఁ జూచితిని. ఏమయిన నేమి? జామ దగ్న్యునిగర్వ మణఁచినవిల్లు చేకొని రమ్ము. వృథా మాట లేల' యన, రాముఁడు 'సరియే మంచిదే కాని చేతిలో విల్లు లేకుండఁగ వచ్చిన నీపయి నేను బాణ మెట్లు సంధింపఁ గల' ననియెను. అందుకు వాలి నవ్వి 'రాజోత్తమా! నీ కీసంశయ మేల? వానరులకుఁ 'బర్వతములే శరాసనములుర' మ్మనెను. అంత

నిరువురుఁ బోరాటమున నారంభించినంతలోనె రామబాణంబు మహాధ్వనితో నేగి వాలిని సప్తతాళంబులను నేలఁ గూల్చి మరల నతనితూణీరము ప్రవేశించె. ఈకోలాహలము విని సుగ్రీవ విభీషణులును, అంగదునితోఁ దక్కుంగల వానరులును గడు వేగముతో నచ్చటికి వచ్చిరి. రాముఁడు నిష్కారణంబుగ వాలిని జంపితిని గదా! యని పశ్చాత్తాపపడెను. వాలియుఁ దన్నుఁ జూడవచ్చినవానరులం జూచి 'ఓ కపివర్యులారా! నేను శ్రీరామునిచేత స్వర్గమునుగాంచఁగలిగితిని. ఇఁకమీఁద మీరు నన్నుంబోలె సుగ్రీవుని, సుగ్రీవునింబోలె నంగదునిఁ జూచికొనుఁ' డని చెప్పి తన్నుఁ గూర్చి విచారించుచున్న తమ్మునిం జేరఁ బిలిచి తన మెడలోని కనకకమలమాలఁదీసి యాతనికంఠంబున నునిచి 'సుగ్రీవా! పూర్వవృత్తాంతము మఱచిపొమ్ము. ఇఁక నీవు నన్నుంబోలె శ్రీరామునిఁ జూచికొనుము. నిన్నాతని కర్పించెద' నని చెప్పి, రామునిం బిలిచి రామభద్రా! రావణునిమైత్రి సంపాదించినదానికయి నాప్రాణ మిచ్చి యాతనియప్పు దీర్చితిని. ఇపుడు నీపొందు గడించినందులకుఁ బ్రాణావసానసమయమున నాశక్తి నీయధీనము చేసెద' నని పలికి సుగ్రీవు నాతనిచేత నప్పగించి 'మీరిరువురు నగ్నిసాక్షికముగా నామాటను బట్టి మైత్రి గావింపుఁ' డన వార లట్లొనరించిరి. పిదప వాలి మరల 'రామభద్రా! నీవు శ్రమణ యెదుటనే యీ విభీషణునకు లంకారాజ్యము వాగ్దానము చేసితివిగదా! అది యెంతయు నాకు హితము. విభీషణా! నీకుఁ బుణ్యావశంబున రాముని మైత్రి సంభవించినది. ఇఁక రావణుఁడు నావలెనే లేనివాఁడని తలంపుము. ఓ సర్వవానరులారా! నాతమ్ముఁడు రాజును, నాపుత్త్రుఁ డగు నంగదుఁడు

యువరాజునై పాలించుచుండ మీరు వారి యానతి ననుస రించి శ్రీరామునకు సంగరసాహాయ్యమొనరింపుఁడు. ఇదియే యంగదునకును నా కడపటిమాట. నే నికఁ బోవుచున్నాఁడ' నని చెప్పి యందరి నెల్లరను విచారసాగరమున ముంచి వీరస్వర్గ మున కేగెను.

ఇది యిట్లుండ నచట లంకాపురపుఁగోటలో నున్న మా ల్యవంతుఁ డీవాలివృత్తాంతమును గూఢచారులవలన విని 'అ కటా! రావణుని దుర్వినయవృక్ష మిప్పటికిఁ జక్కఁగాఁ బూచి నది. ఇతఁడు సీతను గోరుటయే యా చెట్టునకు విత్తు. దానికై శూర్పణఖ నచ్చటికిఁబంపుటయే దాని మొలక. పిదప మారీ చుని మాయలేడిగాఁ బంపుటయే దానిచిగురు. అంత సీతను దొంగిలించుటయు, వాలిమరణము, రామసుగ్రీవవిభీషణులయే కీభావము ననునివి దానిపువ్వులు. ఇఁక నిది శీఘ్రకాలముననే ఫలింప సిద్ధముగా నున్న దని తలంచెదను. అయ్యో! దైవ మెంత ప్రతికూలముగా నున్నది! మహాశూరుఁడగు వాలిని జంపిన యా రాచకొమరుఁ డింకేమి చేయలేఁడు! ఆహా! అవుడే వానరు లెల్లదిక్కులకు సీతను వెదకుటకు బయలుదేఱిరఁట. ఇప్పుడో యిఁకనో వారిచ్చటికి రాఁగలరు. ఏమిచేయుటకును దోఁచకున్నది' యని విచారించుచుండఁ ద్రిజటయను రక్కసి వణఁకుచు నచ్చటికి వచ్చి 'తాతా! రక్షింపుము. రక్షిం పుము. ఏదో యొక కోఁతివచ్చి లంకాపురమంతయుఁ గాల్చి చెట్లు జాల్లు ఱువ్వి పెక్కండ్రు రక్కసులను జంపి తుదకు నక్షకుమారునిఁ గూడఁ గడ తేర్చి నిమిషములో నెగిరిపోయె. అయ్యో! యేమిదిక్కు' అని విలపించెను. అతండు కొంతవడి దుఃఖించి యీ వచ్చినకోఁతి యెవఁడై యుండు' నని తలంచి

'యయ్యో! యెవఁడో యనువిచార మేల? హనుమంతుఁడు లంకవైపునకు బయలువెడలె' నని వింటిని గదా యనుకొని 'అమ్మా! వాఁడేమయిన సీతావృత్తాంతము తెలిసికొనెనా' యని త్రిజట నడిగెను. అదియు సీతతో నాంజనేయుఁడు మాటలాడుటయు నాతని కామె తనశిరోమణిని గుఱుతుగా నిచ్చుటయుఁ జెప్పి 'తాతా' మున్ను మనము నివసించియున్న దండకారణ్యమునకుఁ బోక మన కీపురమున నుండ నేల' యనఁగా 'నోసీ! నీకీభయము మేల?' మనము నివసించునట్టి యీత్రికూటమే గొప్పకోట. దీనికిఁ జుట్టును లోహమయము లైన యేడుగోడ లున్నవి. ఇది గాక దీనికి నలుదెసలఁ బ్రవ్వసియు గడ్డవలె గంభీర మైనసముద్రము గలదు. మనకుఁ బ్రమాద మెట్లు రాగలదు' అని యతఁడుచెప్పి తనయెడమకన్నదరఁగా శంకించుకొని భీతిల్లి 'కుమారీ! మనకుంభకర్ణుఁడు నిద్రనుండి లేచుట కింకను రెండుమాసములు పట్టును; ఆలోచింపఁగాఁ గాలము మనకుఁ బ్రతికూలముగా నున్నట్లు కనుపట్టుచున్నది. ఎట్లయినను విభీషణుఁడు బుద్ధిమంతుఁడు దూరదృష్టిగలవాఁడు నగుటచే శ్రీరాము నాశ్రయించెను. మొత్తముమీఁద వాఁడే పౌలస్త్యవంశము నిలుపుటకు హేతు వగు నని తలంచెద' ననఁగాఁద్రిజట 'తాతా! యెంత మాటాడితివి! నీనోట నే నెన్నఁడు నిట్టి మాట విన లే' దనియెను. అతండును 'పసిదానవు. నీకేమి తెలియును! సరియే కాని రావణుఁ డిపు డేమి చేయుచున్నాఁడో యెఱుఁగుదువా' యని యడిగి 'తాతా! యతఁడు సర్వతోభద్ర మనెడికోటబురుజెక్కి పుష్పవనంబున నశోక వృక్షముక్రిందఁ గూర్చుండియున్న రాత్రించరకాలరాత్రియగు సీతాదేవివైపు చూచుచుండె ననియు నీవార్త తెలిసి మండోదరి

యతనికి నీతి దెలుప నచటికి వెడలినదనియు నిపుడే వింటి' నని యామె చెప్ప 'మేలుమేలు. ఆఁడుదైన నేమి? మంచిపని చేసినది. అయిన నేమి, అతఁడు వినునా? సరియే కానిమ్ము. మనము నేకాంతగృహంబునకుఁబోయి కార్యమాలోచింతము, రమ్మని వెడలెను.

పిదప రావణుఁడు జానకిని జూచి యామె సౌందర్యమున కక్కజపడుచు, నిక్కాంత నాకుఁ జిక్కినది. నాకోరికి ఫలించినది. దైవము నా కనుకూలమయ్యె నని సంతసించుచు, దైవమన నేమి? ముల్లోకములు గెలువఁదగిన ప్రతాపము గల నాకడ్డ మేముండు నని గర్వించుచు సీతను వశపఱచుకొనుట కాలోచించుకొనుచున్నంతలో మండోదరి వచ్చి 'రాజా! ఒంటరిగాఁగూరుచుండి యేమో యాలోచించుచున్నాఁడవుగాని శత్రువులు సమీపించుటను గూర్చి యేమి తలంచితి' వని యడిగెను. అంత రావణుఁడు భార్యవంకఁ దిరిగి నవ్వి 'దేవీ! శత్రువులని క్రొత్తమాట వినిపించితివే! ఎవ రాశత్రువులు? చెప్పు' మన 'వానరసేనతోఁ గూడిన సుగ్రీవుఁడు సహాయుఁడుగా వచ్చిన రామలక్ష్మణు, లనియామె చెప్పి' ఓహో! ఆకుమారతాపసులా! పోనిమ్ము. వారితో నేమి' యని యతఁడవజ్ఞ సేయ 'దేవా యేమిది? సంఘీభావము శంకాస్పదము గాదా? అదిగాక సముద్రుఁడుగూడ నా రాముని లకోరికి భయపడి మార్గమిచ్చెనఁట! వానరులందఱుఁ గొండలు తెచ్చి సేతువునిర్మించిరఁట! ఇదంతయుఁ గన్నులారఁ జూచిన మనచారులు సెప్పుచుండ నీ విట్లనెద వేమి?' యని మాఱుపలికెను. అంత నతం 'డోసీ వెఱ్ఱిదానా! నీ కెవ్వఁడో గట్టిగా వట్టినమ్మకము పుట్టించెఁగాని, యతిగంభీరంబు నపారంబు నగు పారావారము పాయ

యిచ్చుట యెక్కడ? క్షుద్రజంతువు లగుకోతులు కొండలు తెచ్చి యానకట్టఁ గట్టుట యెక్కడ? ఇట్టి మాటలు నమ్మఁ దగునా? యీ మాటలన్నియు నేల? బ్రహ్మ నా తెలివి నెఱుఁగును. మహేశ్వరుఁడు నా సాహస మెఱుఁగును. ఇంద్రుఁడు నాసామర్థ్య మెఱుఁగును' అని ప్రగల్భవచనములు పల్కుచుండ 'ఓ లంకాద్వారపాలకులారా! జానకీపతి వచ్చుచున్నాఁడు. జాగరూకులై యుండుఁడు. మీమీయాయుధములను జేతఁ బూని ద్వారములఁ గాపాడుఁ' డని కేకలు వైచుచుఁ బ్రహస్తుఁ డనురాక్షసుఁ డచటికివచ్చి 'మహారాజా! నరకుమారులిద్దఱు మహావానరసైన్యముతో వచ్చి లంకాపురము ముట్టడించిరి. ఇఁక ముందు గుప్పెడు మెతుకులు గ్రుక్కెఁడునీళ్లు కూడ దొరకవని తోచుచున్నది'యని యేదో చెప్పుచుండెను. అంతలో 'ఓ లంకేశ్వరా, జయము జయ' మని వినయగౌరవములు చూపుచు నొకవానరుఁ డచ్చటికే తేర, రావణుం డతనిం జూచి నీ వెవఁడ వని యడిగెను. అంత నతం 'డో రాజా! నే నంగదుఁడను. రాముని దూతను. శీఘ్రముగా సీతను మాకు సమర్పించి యపరాధము మన్నింపు మని నీ శిరంబులను స్వామి పాదముల కర్పింతువా? లేక యాతనిశరంబుల కర్పింతువా' యని నిన్నడిగి వచ్చుటకై యతఁడు నన్నంపె' నని చెప్ప, రావణుఁడు కోపించి 'వానరుఁడు గూడఁ బెద్దవక్త యయ్యెనే. ఎవఁ డిక్కడ? చూచెద వేల? యీ నీచునినోటికి బుద్ధి సెప్పి పంపు,' మనెను. అంతఁ బ్రహస్తుఁడు 'స్వామీ! వీఁడు దూతగా వచ్చినవాఁడు. వీనితో నేమి?' యన, నంగదుఁడు 'రావణా! నేను రాముని కధీనుఁడ నగుటచే నిపు డేమియుఁ జేయుటకు వలనుపడకున్నది గాని లేకున్న నీ పదితలలును బదిగోళ్లతోను గిల్లి

పది దిక్కులను బాఱవేయకుందునా?' యని నిందించి వేగ
ముగా రాముని యొద్ద కెగిరిపోయెను. తరువాత రావణుఁ
డత్యాగ్రహాగ్రస్తుఁడై 'ప్రహస్తా! సధైర్యముగా శాఖామృగ
ముల నెదుర్కొని వాని నణఁగింపుఁ డని మన సేనానాయకు
లకుఁ జెప్పు' మన నతండు చిత్తమని వెడలెను. అంత 'వాన
రోత్తములు నిశాచరులతలలు నఱకి గుట్టలుగాఁ బేర్చిరి. పుర
గోపురములు నేలఁగూల్చి' రని వినఁబడ, రావణుఁడు తలయెత్తి
చూచి 'ఓరీ దుర్మార్గనిగ్రహులారా! మైమఱచి రాముని కనుకూ
లముగాఁబలుకుచున్నారా' యని, 'దేవి! నీవింటిలోనికిఁబొమ్ము.
నే నీ వానరులను నరులను గూడ గీటడఁగించి దేవతలఁ గట్టి
తెచ్చెద' నని బయలు వెడలెను.

తరువాత భూతలంబున జరగురామరావణులయుద్ధముఁ
జూచుటకై యింద్రుఁడు రథారూఢుఁడై యాకసంబున నిటు
నటు సంచరించుచుండఁ జిత్రరథుండు గూడ విమానారూఢుఁ
డై యచ్చటి కరుదెంచెను. అతని నింద్రుఁడు చూచి 'గంధర్వ
రాజా! సంగరము చూడవచ్చితివా' యని యడుగ, నతం'డది
యొక్కటియే కాదు. 'నా చిన్ననాఁటనుండియు నన్నుఁ బలు
బాములఁ బెట్టుచున్న నిశాచరేశ్వరునకుఁ బోగాలము దాఁ
పించి నట్లున్నది. ఏమి జరగుచున్నదో చూచి ర'మ్మని కుబే
రుఁడు కూడ నా కానతిచ్చె'నని చెప్పఁ, బురుహూతుఁ 'డాహా!
యొక్క తండ్రికిఁ బుట్టినవారికే యట్లుండ నితరులమాట చెప్ప
నేల?'యనియె. చిత్రరథుండు 'మహాత్మా! సంశయమేమి?కుబే
రుని విమాన మపహరించి యతనిఁ బెట్టినపాట్లు లోకం బంత
యు నెఱుంగదా?' యని యుద్ధభూమివైపు చూచి 'దేవేంద్రా!
చూడు చూడు. రావణుఁ డరద మెక్కి విల్లుమ్రోఁగించుచుఁగ

లని కేతెంచుచున్నాఁడు' అన, నింద్రుఁడుచూచి 'మాతలీ! నేను చిత్రరథుని విమాన మెక్కెదను. నీ వీ యరదముఁ గొనిపోయి రాముని కిమ్మని యట్లు గావించె. అంత గంధర్వుఁడు కలని వలను సూచి 'యింద్రా! కపివరులు కడుపులు బ్రద్దలగునట్లుగా గ్రుద్ది చంపిన రాక్షసుల నెత్తురు కాల్వలై పాఱుచుండెఁ జూచితివా' యన నతం 'డోయీ! నీవీ ప్రక్క చూడ లేదు గాఁబోలు! వాఁడిములుకులదాడి కోడి పెక్కండ్రు రాక్షసవీరులు పరుగెత్తి పోయి యందందుఁ జచ్చి పడియున్న కోట్లకొలఁది కోణపుల మాంసముతినుచున్న గ్రద్దలఱెక్కలనీడ నిలిచి సేద దీర్చికొను చున్నారు చూడు చూడు' మనెను. అతం 'డింద్రా! యిటు చూడుము. తన యరదమునకు వెనుకఁ దల్లియుఁ జుట్టము లును, ముందు బంటులును, కుడిప్రక్క వర్ధనిద్రలో మేల్కొనుటచేఁ గన్నులు నలుపుకొనుచున్న కుంభకర్ణుఁడు నెడమ ప్రక్క నూర్వురుతమ్ములం గలిసి యింద్రజిత్తును వచ్చుచుండ రావణుండు రణాంగణముఁ బ్రవేశించె' నని చూపెను. వాసవుం డును బరికించి 'చిత్రరథా! ముందు సుగ్రీవుఁడు వెనుక నంగ దుఁడు నిరుప్రక్కల విభీషణజాంబవంతులును రాఁగ రాముఁడు రథారూఢుఁడై రణాంగణంబున కేతేర సౌమిత్రి ధనుర్ధరుఁడై హనుమంతునిఁ గూడి యనుసరించి వచ్చుచుండె నిటు చూచితివా! ఆహా! ఘోరసంగ్రామము ప్రారంభమైన దనెను. అంత మేఘనాధునిపై విల్లుమోపెట్టినతమ్ముని నిలిపి దశకంఠునిపై రాముఁడు శరము వేయుటయు, నిశాచర వీరు లంద ఱొక్కమాఱుగా రామలక్ష్మణులపై బాణవృష్టి గురియుటయు, దానిని వీరు చల్లార్చి చెలరేఁగి శరాగ్నికి వారి నాహుతి గావించుటయు, నంత నింద్రజిల్లక్ష్మణు లాఁగక పరమదారుణం బగుపో

రొనరించుటయు, నందు సోదరునకు సాహాయ్య మొనరింప నష్టు
వడిన పెక్కెంద్రుపుత్రులు సమయుట గని రావణుం డచ్చటి
కేగుటయు, నంతఁ గుంభకర్ణుం డన్నచోటికి వచ్చి రాముని
సాయకంబుల మూర్ఛిల్ల నాతనిపుత్రుఁ డగు కుంభుం డతివేగ
ముతో రాము నెదిరించుటయు, సుగ్రీవుం డత్యహంకృతితో
నాతని కడ్డముసొచ్చి వాని సందింటంబట్టి నేలబెట్టి ఘట్టించు
టయుఁ, బిదప మూర్ఛనుండి లేచిన కుంభకర్ణుఁడు విజృంభించి
సుగ్రీవు నొడిసి పట్టుటయు, నతఁ డాతనిముక్కును శూర్ప
ణఖ లజ్జతోఁగూడఁ గోసివేయుటయు, నంత నేత్రోకచో
సౌమిత్రి రావణమేఘనాదులకుఁ గన్నె యతిశయించునట్లు
రాక్షససంహారంబు నొనర్చుటయు, దానిపై నింద్రజిత్తు నాగ
పాశము నేయ లక్ష్మణుఁడు గారుడప్రయోగంబునఁ బరిహరించు
టయుఁ బిదప దశగ్రీవుఁడు శతఘ్నిఁ బ్రయోగింప రామాను
జుఁడు మూర్ఛిల్లుటయు, నివ్వార్త విభీషణునివలన నెఱిం
గిన రాఘవుఁడు తన కడ్డముసొచ్చిన నిశాచరసేనలను గుంభ
కర్ణునితోఁ గూడ మడియించి తమ్మునిఁ జూడ నేగుటయు,
నింతలో నాంజనేయుఁ డతివేగముగాఁ బోయి తెచ్చిన ద్రోణ
పర్వతముగాలి తగిలినంతనే లక్ష్మణుండు తెలివి సెందుటయుఁ
గ్రమముగాఁ జూచిరి.

పిదపఁ బ్రతినిమిషము రాక్షస సంఖ్య తగ్గుటయు వానర
సంఖ్య హెచ్చుటయుఁ జూచి రావణమేఘనాదులు పరాక్ర
మింపగా, వారితో రామలక్ష్మణులు క్రమముగా ద్వంద్వయుద్ధ
మారంభించిరి. ఆమహాభయంకరమగు యుద్ధముంగని చిత్ర
రథుఁడు 'దేవేంద్రా! ఈ జంటపోరాటముల కడ్డము వచ్చిన
నిశాచరులతలలచే భూతలంబును శరపరంపరలచే నాకసంబు

నొక్కమాఱుగాఁ గప్పుచు రఘువీరకుమారులు ప్రళయకాలా గ్నులం బోలి విజృంభించి రావణమేఘనాదశేషముగా రాక్ష సకులంబును నేలపాలు గావించిరి చూచితివా?' యన, నతం 'డింకే మున్నది? ఈ చిత్రము చూడుము. ఒకతల నఱికిన నిం కొకతల వచ్చుటగని రాముఁడు నారాయణాస్త్రంబున రావ ణుని శిరంబుల మొదలంటనఱికి మొండెము నేలఁ గూల్చునం తలో సౌమిత్రి బ్రహ్మాస్త్రంబున నింద్రజిత్తుశిరస్సు నూడ నేసె. ఆహా! యెల్లదేవతలు రఘువీరులపైఁ బూలవాన గురిసిరి. నేఁటికి బ్రపంచము నిష్కంటక మైనది. ఈదుర్మార్గుని మర ణామునకై సంతసించిన నిర్జరు లేదో యొక యుత్సవము సేయఁ దలపెట్టి కాఁబోలు నాకై యెదురుచూచుచున్నారు. ఇదిగో మాతలియు నా యరదమును దీసికొనివచ్చెను. నీవింక జాగు సేయక యేగి యీవార్త మనచెలికాఁడగు కుబేరునకుఁ జెప్పు' మని యతనిఁ బంపి వాసవుఁడును దనరథం బెక్కి వెడలెను.

అటుతరువాత లంక యనుగ్రామదేవత యచ్చటికేతెంచిన నలక యను గ్రామదేవతనుజూచి 'అక్కా! విభీషణుఁడు గాక మిగిలినయందఱు సమసిరి గదా! దురదృష్టవశంబున నతండును శత్రువులలోఁ జేరె. ఇంకఁ బురంబున మగవాఁడే కఱవయ్యె' నని విలపింప, నలక 'సోదరీ! తెలియక యట్లనుచుంటివి. ముల్లోకములయందును వన్నె కెక్కిన మహాపురుషుఁడు రా ముఁడు. అతనికి మిత్రుఁడయిన విభీషణుఁడు లంకాపురమునకు రా జగుట మిక్కిలి కొనియాడఁ దగిన దే'యని యోదార్చె. లంకయు నూఱడిల్లి 'అమ్మా! నీ వేల యిచ్చటికి వచ్చితి' వని యడిగెను. అంతనామె 'చిత్రరథునివలన నీ సర్వవృత్తాంతము విని మా రాజును రావణుని సవతితల్లికొడుకు నగు కుబేరుఁడు

మిగిలిన బంధువుల నాశ్వాసించుటకును, విభీషణుని పట్టాభి షేకముచూచి యతనితో రావణుఁడు దొంగిలించిన తనవిమా నమును రాముని కొసంగు మని చెప్పుటకును నన్నుఁ బంపె' నని చెప్పునంతలో నొకశబ్దము వినఁబడెను. దాని విని లంక 'సోదరీ! వింటివా? రామభద్రా! అగ్నిప్రవేశము సేసి నిరపా యముగా వచ్చిన యాపరమ పతివ్రతయగుసీతను గ్రహింపు మని దేవతలు పలుకుచుండి'రని చెప్ప, నలక 'ఔను. రావణుని యింటిలో నున్నందున వచ్చినలోకాపవాదము పోవుటకై జానకి యగ్నిఁజొచ్చినది కాఁబోలు! ఆహా! పాతివ్రత్యమున వన్నెకెక్కిన యావైదేహియే యగ్నిహోత్ర మగుచుండ నామె కగ్నిశుద్ధియన నేమో! అయినను లోకాచారమునుబట్టి యట్లు చేసి యుండు' ననుచుండ మరల మంగళగీతములు విని విభీషణుని మూర్ధాభిషేకమయినట్లున్నది. మనముకూడ నచ్చ టికేపోయి యాపూజ్యు లగుదంపతులఁ జూత' మని వెడలిరి.

అంతఁ బుష్పకముతో విభీషణుఁడు శ్రీరాముని సమీ పించి 'దేవా! నీయాజ్ఞచే నెల్ల దేవాంగనలను జెఱనుండి విడి పించితిని. ఇదిగో విమానము. ఇది యేని కెల్లకోరికలఁ దీర్చుచు వశ్యమై యుండు' నని విన్నవింప, రాముఁడు 'లంకేశ్వరా, మంచిపని చేసితివి. సుగ్రీవా! మన మిఁకఁ జేయఁ దగిన దేమి?' యనఁ గపివరుండు 'మహాత్మా! త్రిలోకశత్రువు దివంబున కేగెను. అగ్నిప్రవేశంబున జానకినింద తొలఁగె. విభీషణుఁడు రాజయ్యె. నీ ప్రతిజ్ఞ నెఱవేఱె. ఇంక నేమి కలదు, ద్రోణా ద్రిని దెచ్చునపు డాంజనేయునివలన లక్ష్మణవృత్తాంతమువినిన భరతుఁ డింతకును బరితపించుచుండును గావున ముందుగా

నతని నచ్చటికిఁబంపి నీ వీ విమానమెక్కు' మన నతండు నంగీకరించి యట్లొనరించెను.

అంత నందఱును విమానమెక్కి వెడలుచుండఁగా సీత యడిగిన ప్రశ్నంబుల కుత్తరములు సెప్పుచు రామలక్ష్మణులు సముద్రమును, అందలి సేతువును జూపి, పిదప మలయాద్రిని కావేరీనదిని, అగస్త్యునియాశ్రమంబును, పంపాసరస్సును, వాలి వధప్రదేశంబును, అనసూయానామాంక మగునుత్తరీయము దొరకినచోటును, జటాయువుపడిన చోటును, శూర్పణఖ నవ మానపఱచిన స్థలంబును, సహ్యాపర్వతంబును, గ్రమక్రమము గాఁజూపి వానింగూర్చి ప్రసంగించి సీతకు విచారము నానం దము నెడ నెడఁ గలిగించుచు వచ్చివచ్చి కౌశికుని యాశ్రమ సమీపమున విమానము నిలుపఁ బోవునంతలో 'ఓరామలక్ష్మ ణులారా! మీరిచ్చట జాగు సేయఁ దగదు. తిన్నగా నయో ధ్యకేగుఁడు. నేనును మధ్యాహ్నిక కృత్యములు నిర్వర్తిం చుకొని రెండునిమిషములలో వచ్చెద'నని వినిపించెను. దాని విని రాముఁ డాహా! మహాత్ముఁ డగువిశ్వామిత్రుఁడే యిట్లాజ్ఞా పించుచుండె. ఇఁక నిచ్చట నాఁగఁ దగ దని యయోధ్యకే విమానమును బోనిచ్చి పురముసమీపించునంతలో హనుమం తుఁ డెదురువచ్చి రామునకు మ్రొక్కి "దేవా! సపరివారులై భరతశత్రుఘ్నులు వచ్చుచున్నా' రని చెప్పఁగా రాముఁడు విమానమును గ్రిందికి దింపె. అంత నత్యానందముతో వచ్చిన భరతశత్రుఘ్నులకునుసీతారామలక్ష్మణులకునుసముచితంబుగ వందనములు, దీవనలు, నాలింగనములు మొదలగు నుపచార ములు జరిగినపిదప రాముఁడు 'తమ్ములారా! వీరిరువురునుసుగ్రీవ విభీషణులు, మనకుఁ బరమమిత్రులు. వీరిమూలముగా మేము

దుఃఖసాగరముసుదరించితి' మని చెప్ప, వారు వీరిని సముచిత ముగసత్కరించి రామునితో 'ఆర్యా! కులగురుఁ డగువసిష్ఠుఁడు పట్టాభిషేకసంభారంబుల సిద్ధపఱిచి నీరాక కెదురుచూచుచు న్నాఁ'డనివిన్నవింప నందఱును ముందునడచుచుండిరి. ఇంతలో వశిష్ఠుఁ డరుంధతీ కౌసల్యా కైకేయీ సుమిత్రలతో నెదురు వచ్చుచుఁ 'కౌసల్యాసుమిత్రలారా! దైవవశమున సుఖము గావచ్చిన మీపుత్రులఁజూచితిరిగదా' యన, వారు 'మీయా శీర్వచనమున మా కిట్టిభాగ్య మబ్బె' ననిరి. అరుంధతియుఁ గైకేయిని జూచి 'ఏమమ్మా! నీవు విచారించుచున్నదాన' వని యడుగఁ 'దల్లీ! యేమి చెప్పుదును? కైకేయి మంథరా ముఖంబున వార్తను బంపి పిల్లల నడవికిఁబంపె నను నపవా దము లోకములో వ్యాపించినది గదా? ఇఁక నా బాలుర మొగమెట్లుచూతునని వగచుచున్నదాన' నని యామె చెప్ప నరుంధతి 'కైకా! నీకీవిచారము వలదు. మాల్యవంతుఁడంపిన శూర్పణఖ మంథరలోఁ బ్రవేశించి యట్లు చేసిన దని పెద్ద లందఱును దివ్యదృష్టిచే నపుడే తెలిసికొని'రని నిజము ప్రక టింప, నందఱును రాక్షసుల దౌర్జన్యమును గూర్చి కొండల మందిరి. అంత వసిష్ఠుఁడు 'ఏమిటి కీమంగళసమయంబున దుర్మార్గుల ప్రసక్తి? రాముఁడు డాయవచ్చె నూరకుండుఁ' డను నంతలో రామాదులు సమీపించి యాపెద్దల కందఱకు వంద నము లాచరించిరి. వీరమాతవు గమ్మని వసిష్ఠుఁడును, అనసూ యారుంధతీలోపాముద్రలతోఁ బాటినై నీవును నాల్గవమహాపతి వ్రత వనలోకంబున వన్నెకెక్కెద' వని యరుంధతియు సీతను దీవించిరి. కౌసల్యాదులు పుత్రులను గోడలిని గాఁగిలించు కొని యానందించిరి. అట్లు యథోచితంబుగ నిష్టజనసుఖాలాప

ములు జరుగుచుండ విశ్వామిత్రుఁ డత్యాదరముతో నేగుదెంచి నాయజ్ఞముసంరక్షింప శ్రీరాము నరణ్యమునకుఁ గొనిపోయిన నే నేయేకార్యములు తలంచితినో యవియన్నియు దైవానుకూల్యమునఁ గొనసాగినవి. ఇఁక జాగేల! శీఘ్రముగా సీతనికభిషేకము గావింతు' మని సందఱును సంతసించి యదివఱకే యాయత్తపఱిచి యున్న ప్రాసాదమందలియభిషేకవేదికకడకు మంగళధ్వనులతో నేగిరి. దేవర్షులు ప్రత్యక్షులై యాభిషేచనికమంత్రములు పఠించిరి. ఇంద్రుఁ డానందముతో శ్రీరామచంద్రునిపైఁ బుష్పవృష్టి గురిపెను. అందఱును బరమానందభరితులైరి. వసిష్ఠవిశ్వామిత్రులును గృతాభిషేకుఁడైనరామునిఁజూచి 'కుమారా! నీవు తమ్ములం గూడి యిక్ష్వాకురాజులు వహించిన భూభారము వహింపు' మని సందఱు నట్లగుఁగాక యని పలికిరి. అంతఁ గౌశికుఁడు 'రామచంద్రా! పట్టాభిషేకోత్సవము కన్నులారఁ జూచిన నీమిత్రులగు సుగ్రీవ విభీషణులను వారిరాజ్యముల బాలింపఁ బంపుము. కుబేరుని విమానంబు మరల నాతకే యంపు' మని నతఁడును వారికి సముచితసత్కారములు గావించి యట్లొనరించె. అంతఁ గౌశికుఁడు 'రామభద్రా! పితృశాసనము నెఱవేర్చితివి. దుర్మార్గులశిక్షించి ధర్మపరిపాలన మొనర్చితివి. దేవమానవుల కానంద మొసంగితివి. సింహాసన మధిష్ఠించితివి. ఇంకేమి గావలయు' నని నతండు సంతసించి 'న్యాయదృష్టితో రాజులుభూమి నేలుదురుగాక. ఈతిబాధలు లేక భూమి ఫలించుఁగాక' యని యాశాసించె. అందఱును దమతమనివాసంబులకుఁ జనిరి. శ్రీరాముఁడును జనరంజకుఁడై సుఖంబుండెను.

---

శ్రీరస్తు

ఓం నమః పరబ్రహ్మణే

# 11. ఉత్తరరామ చరిత్రము

శ్రీరామచంద్రుఁడు రావణసంహారము గావించియయోధ్య కేతెంచి వసిష్ఠవిశ్వామిత్రులచే వెంటనే యభిషిక్తుఁడై రాజ్యమేలుచుండెను. అంతఁ గొలఁదికాలమున కాపట్టాభిషేకము నిమిత్తముగా మహావైభవముతో నొక్కగొప్పయుత్సవము జరిగినది. ఆయుత్సవమునకు నలుదెసలనుకడిపిలువఁబడినరాజన్యులు బ్రహ్మర్షులు లంకాయుద్ధమునందు మిత్రు లయినవానరరాక్షస వర్యులు మొదలుగా ననేకులు వచ్చి యావేడుకను గన్నులపండువుగాఁ జూచి యామహారాజుసత్కారములను బొంది తమ తమ యిండ్ల కేగిరి. మఱికొన్నినాళ్ళకు ఋశ్యశృంగమహర్షి ద్వాదశవార్షిక మైనసత్రయాగము సేయ నారంభించి యచ్చటికిఁ బిలువ నంపఁగా నరుంధతీ కౌసల్యా కైకేయీ సుమిత్రలతో వసిష్ఠమహర్షి యాయజ్ఞమునకు వెళ్లెను. అంత మఱికొన్ని దినములకు జనకచక్రవర్తి గూడఁ దనప్రియపుత్రికను విడువ లేక యెట్టకేలకు నిత్యకర్మములయనురోధముచే మిథిలకు వెడలెను. అంతఁ దండ్రి వెళ్లిపోయినందుకు సీత దుఃఖించుచున్న దని తెలిసి, శ్రీరాముఁడు ధర్మాసనము డిగ్గి యంతఃపురమునకు వచ్చి 'ప్రేయసీ! ఊఱడిల్లుము. ఆహితాగ్నులైన గృహస్థులు స్వేచ్ఛగాఁ దిరుగుటకు వలనుపడదు గావున వారింటి కేగిరిగాని మనల విడిచి వెళ్లుట వారికిమాత్ర మిష్టమా?' యన, జానకి 'నిజమే. కాని తల్లిదండ్రులను బ్రియ

జనమును విడిచిపెట్టుటమాత్రము మిక్కిల కష్టముగానే యుం డు' ననెను. దానిపై రాముఁడు 'ఔనౌను. సంసార మనఁగా నిట్టిదే. కాఁబట్టియే తెలిసినవారు దీనిని విడిచిపోయి యడవు లలోఁ సుఖముగాఁ దపస్సు చేసికొనుచుందు' రనుచున్నంతలోఁ గంచుకిచే వృత్తాంత మంపి యానతిఁ గైకొని యష్టావక్రము హర్షి యక్కడకు వచ్చె. సీతారాములు నాతనికి వందనము లొనర్చి యుచితాసనంబునఁ గూర్చుండఁ జేసి యాతఁడు ఋశ్యశృంగాశ్రమమునుండి వచ్చుట తెలిసికొని యందలి యజ్ఞవృత్తాంతమును బెద్దలకుశలంబు నడిగిరి. అమ్మునియు వారికి సదుత్తరము లిచ్చి సీతతో 'దేవీ! వసిష్ఠుఁడు తన మాటగా నీతోఁ జెప్పుమనిన దొక్కటికలదు వినుము. 'అమ్మా! భగవంతురాలగుభూదేవి నీకుఁ దల్లి. బ్రహ్మతో సమానుఁడైన జనకుఁడు నీజనకుఁడు. సూర్యుఁడును నేనును గురువులముగా నున్న రఘువంశపురాజులకు నీవు కోడలవు, నిన్ను దీవింపఁ దగిన దింకే మున్నది? అచిరకాలంబున వీరమాతవు గమ్ము' అని యాతనిమాటలు చెప్ప, రాముఁడు 'దేవీ! మనము కృతా ర్థులమైతిమి. ఏమనఁగా లోకములో నుత్తము లైనలౌకికుల మాట లర్థమును వెంబడించి నడచును. మహాత్ము లైనమునీశ్వ రుల మాటల నర్థమే వెంటాడి పరుగెత్తును. కావున నమ్ముని వాక్యమున కడ్డులే' దని సంతసించె. అంత నమ్ముని 'రామచం ద్రా! సీతకు గర్భవాంఛ లేవైనఁ గలిగె నేని వెంటనే తీర్ప వలయు నని మీతల్లులును సోదరియు మఱిమఱి చెప్పి' రన, నతం డీసతి కోరినచో నట్లే చేసెద నని చెప్పి 'మునీంద్రా! మా కులగురు విం కేమయినఁ జెప్పెనా?' యని యడిగె. దానిపై నాతాపసుఁడు 'మే మల్లునియజ్ఞములోనున్నారము. నీవు చిన్న

వాఁడవు. రాజ్యమా! క్రొత్తగా వచ్చినది. కావున శరీరము కంటెను బ్రియమయినకీర్తికై ప్రజానురాగమును సంపాదింప యత్నింపు'మను వసిష్ఠునిమాటలు విన్నవింప, రాముఁడానం దించి 'యామహనీయుని యానతిచొప్పున లోకము నారాధిం చుటకు నా కున్న దయను గాని స్నేహమును గాని సౌఖ్య మునుగాని తుదకు జానకిని గాని విడిచిపెట్ట వలసివచ్చినను నేను విచారింప' నని నిండుమనంబునఁ బల్క, సీతయుఁ 'గావుననే నీవు రఘువంశరాజులలో నెల్ల వన్నె కెక్కుచుంటి' వని కొని యాడెను. అంత నష్టావక్రుఁడు విశ్రమింప నేగుటయు లక్ష్మణుఁ డచ్చటికి వచ్చి 'అన్నా! మనము చెప్పినట్లుగాఁ జిత్రకారుఁడు నీచరిత్ర మంతయు గోడలపైఁ జిత్రించె. చూడవచ్చు' నని విన్నవింప, నతండు 'ప్రేయసీ! అ దెందుకో యెఱుగుదువా! నీవిచారము పోగొట్టుటకే'యని చెప్పి 'సరియై కాని యెంత వఱకుఁ జిత్రించినాఁ' డని తమ్ముని నడిగెను. 'పూజ్యురాలి యగ్నిహోత్రశుద్ధివఱకు నయిన'దని సౌమిత్రి చెప్ప రాముఁ డు 'కటకటా! యెంతమాట! దేవీ! జన్మముచేతనే పరిపూతు రాలవయిననీకు నగ్నిశుద్ధి యననఁగా నేమి? ఏదో కాలవశంబున జరిగిపోయిన యావృత్తాంతము మరల స్మరింపఁ జేసి తప్పు చేసి తిని. అనుగ్రహింపుము' అని వేఁడుకొన, సీత 'ఆర్యపుత్రా! కానిమ్ము. దీని కేమి! నీచరిత్రము చూచెదము ర'మ్మన, నంద ఱును జిత్తరువు చూడ నేగిరి.

లక్ష్మణుఁ డాయావిషయములను దెలుపుచుండ సీతసాభి జ్ఞానముగాఁ జిత్తరువు విలోకించుచు 'నివి యే' మని యరుగ నతండు 'దేవీ! విశ్వామిత్రుఁడు మాయన్నకుఁ బ్రసాదించిన జృంభకాస్త్రంబు లివియే' యని చెప్ప, రామునియానతిచే

నామె వానికి నమస్కరించెను. రాఘవుఁడును 'దేవీ యివి నీ సంతానము ననుసరింపఁగల' వని దీవించెను. అంత సౌమిత్రి, శ్రీరాముఁడు శివునివిల్లు విఱుచుట, పెండ్లినాఁటి తమతమ రూపములు, జనకశతానందులు దశరథవసిష్ఠాదులను గౌరవించుట, వివాహమహోత్సవము మొదలగు మిథిలావృత్తాంతము ను క్రమక్రమముగాఁజూపుచుండ, జానకి యూర్మిళావిగ్రహముఁ జూపినవ్వుచు 'నీమె యెవతె'యని యడిగె. లక్ష్మణుండును సిగ్గుతో 'దేవీ! నూఁడఁ జగినది మిగులఁ గలదు చూడు'మని మఱపించి పరశురామునిఁజూపఁ నామె యా రూపము చూచి భయపడెను. సౌమిత్రి మరలఁ దా మయోధ్యకు వచ్చుటను జూప, రాముఁడు 'అక్కటా! నిరంకుశముగా రాజ్యము సేయు తండ్రి జీవించియుండఁగా దల్లు లనురాగముతో మసలఁ బెంచుచుండఁగాఁ గ్రొత్తగా భార్యలు శాఁపురమునకు వచ్చియుండఁగా సుఖమనుభవించిన యాదినములు మనకు మరల రావు గదా?'యని కన్నుల నీరు నించె. పిదప లక్ష్మణుఁడు మంథరా వృత్తాంతము నూపుచుండ రాముఁడు దానిని దప్పించి యామెకు శృంగిబేరపురములోని గారచెట్టు దానిదగ్గఱనే గుహునితోఁ దనకు స్నేహము గలుగుటనుజూపించె. అందఁ దాము జటలు గట్టికొనుటయు గంగానదిని దాఁటుటయుఁ జూపుచుండ, రాముఁడు గంగానదిని జూచి 'అమ్మా! నీ వరుంధతివలెనే నీకోడలగు సీతకు మేలు గోరుచుండు'మని నమస్కరించె. మఱియును సౌమిత్రి చిత్రకూటమార్గమును, అందలి శ్యామనామక వటవృక్షమును జూపుచుండ రాముఁ డించుకసేపు నిలిచి యా మఱ్ఱిచెట్టువైపే చూచుచుండెను. అది చూచి సీత 'ఆర్యపుత్రా! నీకా ప్రదేశ మింకను జ్ఞప్తిలో నున్నదా?'

యన నతండు 'దేవీ! యిచ్చటనే కాదా? నడచి నడ వచ్చుటచే నలసి వాడిపోయిన తామరతూఁడువలె బలవు సెడిన నీవు నాయొమ్ముమీఁద నిద్రపోయితివి? ఈచోటు నేనెట్లు మఱచిపోవుదు?' నన, సీత సిగ్గుతోఁ జిఱునగవుతో మఱియొక ప్రక్క చూచుచుండె. పిదప 'నిదిగో విరాధసంవాదము. ఇవి యే కొండయేళ్లు. ఇవియాశ్రమములు. ఇది ప్రస్రవణ పర్వతము అనిచూపుచుండ, రాముఁడు 'ప్రేయసీ! మన మీకొండమీఁది నివసించుటయు, నపుడపుడు దీనిదగ్గఱ నున్న యీగోదావరి యిసుకతిన్నెలమీఁద విహరించుటయు, లక్ష్మణుఁడు మనకుఁ గావలసిన వెల్ల సమకూర్చుటయు, మఱియు నీకొండమీఁది పొదరింటిలో నొకనాఁటిరాత్రి మనము బుజముబుజము కలిపి కొని పరుండియుండి యత్యనురాగముతో మెల్లఁగా నేవేవో గొడవలఁ జెప్పికొనుచుండ మాటలతోనే యారాత్రి తెల్ల వాఱిపోవుటయు నీవిపుడు తలఁచుచుంటివా?' యనియడిగె. దానిపైఁ జిఱునగవుతోఁ గొంచెముముందునడచి పంచవటిని, అందలి శూర్పణఖా సంవాదమును జూచి 'హా! ఆర్యపుత్రా! నీదర్శన మింతవఱకే' యని బెదరి చూడ 'నోసీ! యిది చిత్త రువు భయపడకు' మని 'అక్కటా! జనస్థానవృత్తాంత మిపుడు జరుగుచున్నట్లే యున్న' దనెను. అంత లక్ష్మణుఁడు సీతాపహ రణమును జూపి 'దేవీ! మాయలేడిమూలముగా సంభవించిన గొప్పయాపద యిదియే. ఈ విపత్తు వచ్చినప్పటి మాయన్న యవస్థను జూడఁగా ఱాళ్లకు గూడ నేడుపువచ్చినది. వజ్రము నకుఁ గూడ గుండె పగిలిపోయినది. అక్కటా! దీనికిఁ దగిన ప్రతిక్రియ చేసిన నిప్పటికిఁ గూడ మనస్సు కలఁగుచునే యున్న' దన, సీత కన్నులు నీరు పెట్టి యప్పటితనయవస్థఁ దలఁచికొని

విచారించె. రాముఁడును గంటికి నేలకు నొక్కధారఁగా గన్నీరు విడిచి 'తమ్ముఁడా! తొల్లి జానకిం గోలుపోయినపుడు జనించిన దుఃఖాగ్ని యెట్లయిన శత్రువును సంహరింపవలయు ననెడి కోరికచే నపు డణఁగి చల్లాఱినది. క్రమముగా ముగ్గి పండైన యీమనసులోనిపుండు దీని చూచుటచేత నిపుడు రేఁగి యాఁగరానిపరితాపమును గలిగించుచున్న'దనియెను. దానిపై సౌమిత్రి యిది పని గాదని తలఁచి వారిని జిత్తరువు గనఁ జేసి 'ఇదిగో జటాయువుశౌర్యమున కుదాహరణము. ఇదియే దనుకబంధుఁ డున్న కుంజవంతము. ఇది మతంగాశ్రమము. ఈమె శ్రమణ. ఇది పంపాసరస్సు. ఇతఁడే మహోపకర్త యగు హనుమంతుఁడు' అని చూపి వారి కానందము గలిగించె. అంత సీత 'వత్సా! చూడు. ఆకొండమీఁది యొక చెట్టుక్రింద మీయన్న యేడ్చుచు మూర్ఛిల్లిపడినట్లును నీ వాతనిఁ బట్టికొనినట్లును జిత్రింపఁబడినదే. యాకొండపే రేమి?' యన, నతఁ'డిదియే మాల్యవంతము. ఇచ్చటనే'యని యేదో చెప్పుచుండ, రాముఁడు 'తమ్ముఁడా! వలదు, చెప్పవలదు. ఆవృత్తాంతము తలఁచికొనిన మరల సీతావియోగము వచ్చినట్లుండు'ననెను. అంత లక్ష్మణుఁడు 'దేవీ! ఇటుపైని గపివీరులు రాక్షసులు చేసిన పనులనేకములు గలవు. నీవు వీనిం జూడఁ దిరుగుటచే శ్రమపడితివి. కావున విశ్రమింపు' మన, నామె రామునితో 'నార్యపుత్రా! యీ చిత్తరువు చూచుటచేఁ బ్రసన్నగంభీరంబు లగు వనవీథులలో నొక్కమాఱు విహరింపవలెననియు భాగీరథిలో మరల నొక్కసారి స్నానము చేయవలయు ననియుఁ గోరిక పుట్టిన'దని విన్నవింప, రాముఁడు 'సంశయ మేమి? నీకుఁ గల వాంఛలు తీర్పవలసిన దని యిపుడే కదా పెద్దలు గూడ వార్త

యంపిరి? తమ్ముఁడా! శీఘ్రముగా వెళ్లి కుదుపు లేనిరథము రప్పింపు' మని యాన తీయ నతఁడు వెడలె. సీత యందు కానందించి 'మీరు కూడ రావలయుఁజుఁడీ' యన 'నోసీ కఠినురాలా! యీ మాట చెప్పవలయునా' యని 'ప్రేయసీ! నీ వలసినట్లుంటివి. ఈ లోపలిగదిలోఁ గొంచెము సేపు పరుండు' మని యామె బుజ మును దన మెడమీఁదికిఁ జేర్చికొని రెండడుగులు నడచి 'సుం దరీ! యేమిది? నిన్నుఁ దాఁకినంతనే సకలేంద్రియవ్యాపారము నణఁచుచు నేదో యొక వికార ముదయించి నాచైతన్యమును సంచలింపఁ జేయుచున్నది. ఆహా! ఇది సుఖమో లేక దుఃఖ మో, నిద్రయో కాక మోహమో, విషవేగమో లేక మద మో, యేదియైనదియు నిశ్చయింప రాకున్నది సుమీ!' యన నామె 'నాథా! నీవు నాయెడ నిజ మయినకూర్మియు నిశ్చల మయిన యనుగ్రహమును గలవాఁడవు గదా! యిందాశ్చర్య మేమి! యిఁక రమ్ము. నాకు నిద్ర వచ్చుచున్న' దని యాగది లోనికి వెళ్లి యొక్కచో శయనించిరి.

అంత రాముఁడు 'రమణీ! నీతలక్రిందకెత్తు లేదే' పోనిమ్ము. పెండ్లి యయినది మొదలుగా నింటిలో నున్నపుడు గాని, వన వాసము చేసినపుడుగాని, చిన్నతనమునఁగానీ, జవ్వనమునఁ గాని, యింకొకకాంత నిద్రింప నెన్నఁడు నొసఁగని యీ రామునిభుజమే నీకుఁ దలగడ' యని యామె నక్కునం గదియించి తలక్రిందకుఁ దనభుజము చేర్చినంతలో నొక్క పాడికునుకు పట్ట 'హా నాథా! కష్టము కష్ట' మని యామె పలవరించె. రాముఁ డారమణీ నతిస్నేహముతోఁ జూచి 'అప్పు డే నిద్రపట్టినది కాఁబోలు! అవురా! యింటికి లక్ష్మియుఁ గన్నుల కమృతవర్తియు దేహమునకు మంచిగంధపుఁబూఁతయు

నగు నీ పడఁతిసంబంధమెట్టిదైన సహింపఁదగునుగాని యొక్క వియోగము మాత్ర మోర్వరా' దనుకొనుచుండఁగా మరల నామె 'హా నాథా! యెచ్చటనుంటి' వని కలవరించె. దాని విని యతఁ 'డోహో! చిత్తరువు చూచుటచే వెనుకటివియోగమిపుడుకలలోనికి వచ్చినట్లున్నది' అని యామె మేనిని జేతితో నిమురుచు 'ఎట్టి యవస్థలో నైనను సుఖముగాని దుఃఖముగాని యెవ్వరు సమముగా ననుభవింతురో, ఎంతకష్టపడి యున్నవారైనఁ బరస్పరము చూచికొని నంతనే యెవ్వరు చిత్తవిశ్రాంతి నొందుదురో, ఎంత ముసలితనములో నయిన నెవ్వ రన్యోన్యానురాగము విడువకుందురో, పెండ్లియయినది మొదలుగాఁ గ్రమక్రమముగా సిగ్గు తొలఁగుచున్నకొలఁది నొకనాఁటికంటె నొకనాఁ డెవ్వ రామరణాంతము ప్రేమసారమున బద్ధులై యుందురో యట్టి యనురక్తు లగు భార్యాభర్తల కెల్లయెడల నెట్లయిన భద్రము గలుగుఁగాక యని కోరఁదగినది' యని తలఁచికొనుచుండ, దుర్ముఖుఁ డను నంతఃపుర పరిచారకుఁడు వచ్చెను. వానిఁజూచి రాముఁడు కొంచె మొత్తగిలి 'లోకు లేమనుకొనుచున్నా' రని యడుగ 'సీత నడుమ నుండఁగా నిట్టివార్త నెట్లు సెప్పఁగలను? ఆహా! దేవ యిట్టిదేకదా' యని సంశయించికొని 'దేవా! రామునిపరిపాలనంబున దశరథుని మఱచిపోయితి మనుకొనుచున్నా' రని చెప్పెను. అంత నతండు 'దీని కేమి? చెప్పఁ దగినది చెప్పు' మన, వాఁడు మిక్కిలి దగ్గఱకు వచ్చి చెవిలో నొక్కమాట సెప్పెను. అది విని యతం 'డక్కటా యెంత మాట పుట్టెను? ఈ మాటకంటె వజ్రముతోఁ బొడుచుటయే మేలుగానుండును. అయ్యో! అగ్నికుండములోఁ బ్రవేశించుట మొదలుగాఁ గల పలువిధము లగుపరీక్షలచేఁ

పరపురుషునియింటిలో నున్నదనెడి యపవాదము సీతకుఁ దొలఁగి పోయిన దనియే యనుకొంటిమి. కాని యా నింద వెఱ్ఱికుక్క విషమువలె నిప్పటి కెల్లయెడలఁ బ్రాఁకినది కాఁబోలు? ఆహా! యెంతటి భాగ్యహీనుఁడను? ఏమి చేయుదును' అని శోకించి కొంచె మాలోచించి "ఏ మయిన నేమి? లోకము ననుసరించి పోవుటయే సజ్జనులధర్మము. కావుననే నా తండ్రి తనప్రాణమును నన్నును గూడ విడిచిపెట్టి లోకారాధనము నెఱవేర్చెను. ఇదిగాక, యిప్పుడేకదా! 'ప్రజానురాగము సంపాదింప యత్నింపు' మని యాచార్యులు గూడ సందేశమంపిరి. నా పూర్వులు సంపాదించిన కీర్తికి నేను భంగము దెచ్చి యెట్లపవాదముపా లగుదును? అయ్యో! దేవీ! జనకనందినీ! పరమపావనీ! భూమీసుతా! రామమయజీవితా! అరుంధతీప్రశంసితా! సీతా! నీవలన లోకము పవిత్రమైనదిగాని నీయెడలోకోక్తి మాత్ర మపవిత్రమైనది. ఆహా! నీకిట్టియపవాదము దుర్దశయుఁ దగునా! ఛీ! లోకమును నిదింపనేల? రఘువంశమునఁ బ్రజలకనురాగము లేకపోయినదా? విధి యిట్లుండఁగా వా రేమి చేయుదురు? ఎక్కడనో యగ్నిశుద్ధి యయ్యె నని చెప్పిన నెవ్వఁడాదూరవృత్తాంతము నమ్మును?" అని విలపించుచు విచారించుచు సంశయించుచు నెట్టకేలకుఁ దెగించి 'దుర్ముఖా! నీవు వెళ్ళి నవీనరాజయినరాముఁడు సీత నడవిలో విడిచి వచ్చుటకై నిన్ను రథము తీసికొని రమ్మనె నని లక్ష్మణునితోఁ జెప్పు'మని మెల్లగా జెప్పి వానిని బంపి 'అక్కటా! నే నెంతక్రూరుఁడను? పెంపుడుచిలుక నెఱుకులవాని కిచ్చినట్లుగాఁ జిన్నటనాఁటనుండియును బెంచిన యీసతీతిలకమును మృత్యుదేవత కర్పించుచుంటిని గదా? ఛీ! పాపాత్ముఁడ నైన నే నీ దేవిని దాఁ

కుట యేల!' అని యామెతలయెత్తి తనచేయి తీసికొని 'ఓ పేరి యసీ! మంచిగంధపుఁజెట్టని భ్రమపడి ముసిఁడిచెట్టు చెంతఁ జేరితివి. ఈకర్మచండాలుఁడైనరాము నింక విడిచిపెట్టు' మని లేచి 'హాదైవమా! రామునిమనుగడలాభము నేటితో సమాప్త మైనది. నాకిపు డీలోక మంతయు జీర్ణారణ్యముగా నున్నది. అకటా! సంసార మసారము. శరీరము కాష్ఠప్రాయము. ఇఁక నేమిగతి' యని యేడ్చుచు వసిష్ఠ విశ్వామిత్రాదులను సుగ్రీవ విభీషణాదులను పేర్కొని 'మహానుభావులారా! నాకనేక భం గుల నుపకారముచేసి సాహాయ్యపడిన మిమ్మందఱను నేను మోస పుచ్చితిని.నిండుచూలాలయిన యీదేవిని రక్కసుల కాహా రముగావించుచున్నాఁడ'ననిదుఃఖించుచు సీతకాళ్ళపైఁ దలపెట్టి 'దేవీ! నీపాదకమలములను రామునితల తాఁకుట కిదియే కడ సారి'యని యేడ్చెను. ఇంతలో, 'శ్రీరామచంద్రా! మహారాజా! యమునాతీరమందలి మునీశ్వరులందఱు లవణాసురుని బాధకుఁ దాళఁజాలక నిన్ను వేఁడుకొనవచ్చి'రని యొక్క మాటవినఁబడ నతఁడులేచి 'ఔరా! యింకను రక్కసునిబాధ మిగిలియున్న దా? మధురాధిపతియుఁ గుంభీనసీపుత్త్రుఁడు నగునీదుర్మార్గుని వధింప శత్రుఘ్నునిఁ బంపునంతవఱకే యీభయము' అని నాలు గడుగులు నడచి మరలి సీతను జూచి 'హాభగవతీ! వసుమతీ! నీపుత్త్రికను నీవే చూచికొను' మనుచు వెళ్లెను. అంత సీత మేలుకొని, ఆర్యపుత్త్రా! యెచ్చట నుంటివి? అని తొందరపడి లేచి 'అకటా! పాడుకలవలనఁ గలిగినభయము తుదకు నిజమే యైనది. నిద్రించుచున్న నన్నొక్కతెను విడిచి యతఁడు వెళ్లె నా, కానిమ్ము. అతనిఁ జూచినపిదప నామనస్సు నాకు స్వాధీన మయ్యేనేని కోపగించెదను' అనుచు 'నెవఁ డక్కడ?'అని పలు

కరించె. అంత దుర్ముఖుఁడు వచ్చి 'తల్లీ! లక్ష్మణకుమారుఁడురథ ము తోలుకొనివచ్చి సిద్ధముగా నుంచె' నని విన్నవింప నామె భాగీరథీస్నానమున కనియే సంతసించి 'యిదిగో వచ్చుచున్న దానను'అని లేచి చిత్తరువుమీఁది కులదేవతలకును మునుల కును నమస్కరించి మెల్లఁగావచ్చి రథ మెక్కెను.

ఒకయడవిలో దారి తెలియక తొట్రుపడుచున్న యొక తాపసి నొక వనదేవత చూచి దగ్గఱకువచ్చి 'నీపేరేమమ్మా! యెచ్చటినుండి వచ్చుచుంటివి! ఈదండకారణ్యములో నీకేమి పని?' యని యడుగ నామె 'నాపేరాత్రేయి, వాల్మీకియాశ్రమ మునుండి యగస్త్యునియొద్ద వేదాంతవిద్య నేర్చికొనుటకు వెళ్లు చుంటి' నని చెప్పి 'నీపేరేమమ్మా' యని మరల నడిగె. ఆమెయు నాపేరు వాసంతి యని బదులు సెప్పి మును లందఱు బ్రహ్మ జ్ఞానమునకై వాల్మీకిమహాముని నాశ్రయించుచుండ నీవచ్చటి నుండి యేల వచ్చితి'వని మరల నడుగ, నాత్రేయి 'ఏమి చెప్పుదు నమ్మా! అయిన వినుము. కుశుఁడు లవుఁడు నను పేర్లుగల యిరు వురు పసిపిల్లలను దీసికొని వచ్చి యొకవనదేవత యామహర్షి కిచ్చెను. వారిని జూచినచో మనుష్యులకుఁ గాదు మృగము లకుఁ గూడ జాలి పుట్టును. ఇది యిట్లుండఁగా వారిమహిమ వినుము. జృంభకాస్త్రము లాపిల్లలకుఁ బుట్టుకతోడ నేవచ్చి నవఁట. ఆ పసిబిడ్డల నామహర్షి చేరఁ దీసి పెంపుడుతల్లి వలెఁ బెంచి యుపనయనము కాకమునుపే వేదములు దక్కఁదక్కిన విద్యలు చెప్పి పిదప గర్భమాసములతోఁ గూడినపదునొకండ వయేఁట వారి కుపనయనము నెఱవేర్చి వేదత్రయము చెప్పు చుండె. అట్టిప్రతిభ గలబాలురతో నాబోఁటిదానికిఁ జదు వెట్లు సరిపడును? ఇదియొక కారణము. ఇంకొక టేమనఁగా,

వాల్మీకిమొకనాఁడుమధ్యాహ్నముతమసానదికి, స్నానముచేయు టకు వెళ్లి యచ్చట జంటగాఁ దిరుగుచున్న క్రౌంచపక్షులలో నొకదాని నొకకిరాతుఁడు చంపుటచూచి 'ఓనిషాదా! మిక్కిలి యనురాగముతోనున్న యీక్రౌంచమిథునములో నొకదానిని జంపితివి గావున నీవు చిరకాలము బ్రతుకవు' అనునర్థముగల 'మానిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీస్సమాః। యత్క్రౌం చమిథునాదేక మవధీః కామమోహితం' అని యప్పటికప్పు డాకస్మికముగా వచ్చిన శ్లోకము నుచ్చరింపఁగా నపుడే బ్రహ్మ దేవుఁడు ప్రత్యక్షమై 'మునివరా! నీవుభూలోకములో మొదటి కవీశ్వరుఁడ వైతివి. నీజ్ఞాన నేత్ర మడ్డులేక ప్రకాశించుచున్నది. రామచరిత్రము వర్ణింపు'మని చెప్పి యంతర్ధానమయ్యె నఁట. అప్పటినుండియు నతఁడు రామాయణము రచియించుచుండెఁ. దానిచేతను జదువు సాగకున్నది. ఈ రెండు కారణములచేత దూరమైనను మంచి దేయని యిట్లు బయలు దేఱితిని'అని చెప్పి 'యింకఁ బ్రొద్దుపోవుచున్నది.అగస్త్యాశ్రమమునకుదారిచూపు' మని యడుగ, నామె 'ఈ కనఁబడునదే పంచవటి. దాని ప్రక్కనే గోదావరి, దానియొడ్డుననే పోవ్ము' అని చెప్పె. అంత నాత్రేయి కన్నీరు విడిచి 'హా జానకీ! నీవు సంచరించిన యీ ప్రదేశమంతయు నామావశిష్ట మైన నిన్ను నాకన్ను లకుఁ గట్టుచున్న'దన, వాసంతి భయపడి 'ఏమమ్మా! అట్లను చున్నావు ? సీత కేమయినఁ బ్రమాదమా!' యని తొందరతో నడుగఁ 'బ్రమాదమే కాదు. అపవాదము కూడ వచ్చిన'దని యావృత్తాంతమంతయుఁ దెల్పె. అంత వాసంతి కొంతవడి దుఃఖించి 'అమ్మా ! ఆత్రేయీ ! సౌమిత్రి యడవిలో విడిచి వెళ్లినతరువాత సీత యేమయినదో తెలిసెనా?' యని యడుగ

లేదని యామె చెప్పె. అంత వనదేవత 'అయ్యో! వసిష్ఠుఁడు, అరుంధతి, కౌసల్యాదిమాతలు నివసించి యున్నయింటిలో నెంత పని పుట్టెను?' అన, నామె 'వారంద ఱాకాలమున ఋశ్యశృంగుని సత్రయాగమునకు వెళ్లిరి. ఆ యజ్ఞ మిపుడు సమాప్త మయినది గాని సీత లేని యయోధ్య కేఁగ వెళ్ల నేల యని తలఁచి వాల్మీకితపోవనమునకుఁ బోయి యచ్చట నుండ నిశ్చయించికొని రఁట' అని చెప్పఁగా, రాముఁ డిపు డేమి చేయుచుండె నని మరల నడిగి, ఆత్రేయియు 'నతండు బంగారు సీతబొమ్మనుభార్యగానెంచికొనియశ్వమేధము సేయ మొదలు పెట్టెను' అని చెప్పఁగా 'అయ్యో! యెంతకష్టము! లోకోత్తరు లయినపురుషులచిత్తములు వజ్రముకంటెను గట్టివి, పుష్పము కంటెను మెత్తనివి. వాని నెవ్వరు తెలిసికొనఁ గలరు? నేఁటి కిట్టిపని జరిగినదా?' యని విచారించె. అంత మేధ్యాశ్వమును విడుచుటయు, దానికి రక్షకులను నియమించుటయు, వారి కధిపతిగా లక్ష్మణపుత్త్రుఁ డగుచంద్రకేతువు నేర్పఱుచుటయుఁ జెప్ప 'నవురా! కుమారలక్ష్మణునకుఁ గుమారుఁడు కలిగెనా! మంచి మాట వింటి నమ్మా!' యని యామె సంతసించె. అంత ''రాముఁడు నిట్లు యజ్ఞదీక్షనారంభించి యుండఁగా నొకనాఁ డొక బ్రాహ్మణుఁడు తనచనిపోయినకుమారుని దెచ్చి రాజద్వారమునఁ బెట్టి 'ఓ రామా! శంబూకుఁ డనుశూద్రుఁడు తలక్రిందుగాఁ దపము సేయుచుండె. ఆకారణమున నిట్టి యక్రమమరణము జరిగినది. వానిఁ జంపినచో నీ బాలుఁడు జీవించును. అట్లు సేయుము' అని మొఱ్ఱ పెట్టికొన, నతండును దన పాలన లోపమే కదా యని తలంచి శంబూకవధకై బయలుదేఱెను'' అనిన యాత్రేయి మాటలు విని, వాసంతి 'ఓహో! వాఁడీజన

స్థానమున నేయున్నాఁడు. అతఁ డిక్కడికే వచ్చును గాఁబోలు! కానిమ్ము. మరల నతనిఁ జూచుభాగ్య మబ్బినది. కాని, యాత్రేయీ! యిఁకఁ దడయ నేల ? మట్టమధ్యాహ్నమయినది. అతిథ్య మంగీకరించి పోవచ్చును, ర'మ్మని యిరువురును వెళ్లిరి.

అంత విమానారూఢుఁడైన రాముఁ డాయరణ్యమునకు వచ్చి శంబూకుని సమీపించి కత్తి కేలఁ బూని పై కెత్తి 'ఓ దక్షిణహస్తమా! గర్భభారముచే నోపలేనిజానకిని గాఁ అడవి పాలుచేసిన రామునిదానవుగదా! నీకు దయ యెక్కడిది? శంకింపక యీశంబూకునిఁ జంపుము. బ్రాహ్మణకుమారుని బ్రతికింపు' మనుచు వానిని రెండుతునకలు చేయఁగానే యొక దివ్యపురుషుఁడు ప్రత్యక్షమై 'ఓమహాత్మా! నాకు యమబాధను మాన్పి స్వర్గ మిచ్చితివి. శూద్రుఁడ నైనను నాతపస్సే నాకు మహోపకారముచేసినది. లేకపోయిన దండకారణ్య మెక్కడ అయోధ్యయెక్కడ! నాకై వెదకుచు నీ విచ్చటికి వచ్చుట యెక్కడ? నీబోఁటి సజ్జనునిచేతిలోఁ జచ్చుటకంటె జన్మమునకు సాఫల్య మేమికలదు? నమస్కారము. నాకు సెలవి'మ్మనిపలుక, నతండు 'నీవు పుణ్యలోకమున కేగి యానందింపు' మని దీవించి యిటునటుఁ జూచి 'ఆహా, యిది దండకారణ్యమా? ఈ కొండలు, ఈ నదులు, ఈ వాఁగులు, ఈగోతులు, ఈయగస్త్యుని యాశ్రమము నివన్నియు నేను మున్ను చూచినవే' యని పరిశీలించుచుండె. అంత శంబూకుఁడు 'దేవా! ఆ కనఁబడునవి జనస్థానభూములు. అందే దేవర ఖరదూషణాదిరాక్షసులను జంపి మునుల కభయ మొసఁగె' నని చూప, రాముఁ డవి యన్నియు సాభిప్రాయముగాఁ జూచి సీతను దలఁచికొని విచారించుచుండె. అంత శంబూకుఁడు, 'మహాత్మా! అగస్త్యునకు

నమస్కరించి నాపుణ్యాలోకమునకుఁ బోయెదను. సెలవిమ్మని కోరి యట్లు వెడలెను.

పిదప రాముఁడు మున్ను తాను సీతయుఁ గలిసి సంచరించిన ప్రస్రవణము గోదావరి పంచవటి మొదలగు ప్రదేశంబులనుజూచి దుఃఖించుచు 'ఆహా! చిరకాలమునకుఁ జూచుటచే నీవన మంతయు మాఱిపోయి నట్లున్నది. మున్ను నదులు ప్రవహించినస్థల మిపుడు మెట్టగా నున్నది. తొల్లి మెఱకగానున్న దిపుడు నదియైనది. చెట్లు లేనిచోటఁ జెట్లు పెరిఁగినవి. మును పటి దట్టమైనయడవులిపుడు పలుచనైనవి. కాని కొండలు మాత్రము మార్పు నెందక యావనమే యిదియని తెల్పుచున్న' వని గుఱుతు పట్టుచు 'అక్కటా! ప్రియసతిని విడిచి నేనొంటరిగా నివ్వనము చూచుచుంటినా' యని విచారించుచుండ, శంబూకుఁడు మరల వచ్చి 'దేవా! అగస్త్యుఁ డొకసారి తనయాశ్రమమునకు వచ్చి పొమ్మని నీతోఁజెప్ప మనియె' నని విన్నవించి పోయెను. రాముఁడునట్లే యామహర్షిని(జూడ నేగెను.

ఒకనాఁడు యోగినీవేషము దాల్చిన మురళ యనునది తొందరగా నెక్కడికో పోవుచుండ నట్లే తాపసీవేషము ధరించినతమస యను మఱియొక నది దారిలో నామెను గలిసికొని 'సఖి మురళా! యెచ్చటికో తొందరపనిమీఁదఁబోవుచున్నట్లున్నదాన' వని పలుకరించె. అంత మురళ "భగవతీ తమసా! మఱేమియు రహస్యముగాదు వినుము. 'శ్రీరాముఁడుభార్యను విడిచినది మొదలుగా మనోవ్యథచే మిక్కిలి చిక్కియున్నాఁడు. ఇతనిని జూచినది మొదలుగా నామనస్సులో బెంగపడినది. ఇతఁ డిపుడు బయలువెడలి పంచవటిమీఁదుగా నయోధ్యకుఁ బోఁగలఁడు. అపుడు పంచవటియందు మున్ను తాను భార్యతో

విహరించిన ప్రదేశములను జూడక పోఁడు. ఆచూచినపుడు తప్పక యీతనికి విచార మధికమై జీవితసంశయము గలిగించు నంతటి పని చేయకపోదు. కావునఁ దల్లీ గోదావరీ! యితనికిశోక వేగమున స్మృతితప్పినపుడెల్ల నీవు నీటితుంపరలతోఁగూడిన చల్లనిగాలి విసరుచు శైత్యోపచారము సేయుచుండు'మని గోదావరితోఁ జెప్పుటకై యగస్త్యునిభార్య యగులోపాముద్ర నన్నుఁబంపిన'' దనిచెప్పఁడమస ''మేలుమేలు, మంచిపని చేసినది. తగినసమయముగూడ వచ్చినది చెప్పెద వినుము, వాల్మీకి తపోవనమునకు సమీపమున సీతను విడిచి లక్ష్మణుఁడు వెళ్లిన పిదపఁ గొంతసేపునకు జానకి ప్రసవవేదన పడి యోర్వలేక గంగానదిలో దిగినది. వెంటనే యచ్చటనే యామె కిద్దఱు పిల్లలు పుట్టిరి. అంతలోనే గంగాదేవియు భూదేవియు జాలిపడి యా శిశువులను దల్లిని బైకిఁదీసి కొంత కాలమువఱకుఁ గని పెట్టిచూచిరి. పిదపఁ బిల్లలుపాలు విడిచినతోడనే వారిని గంగ తీసికొని వెళ్లి వాల్మీకిమహర్షి కప్పగించివచ్చినది. ఇది యిట్లుండఁగానొక నాఁడు సరయువు వచ్చి రామభద్రుఁడు శంబూకునిఁ జంప జనస్థానమునకు వెళ్లె నని చెప్పినది. ఆమాట వినఁగానే భాగీరథి సీతను దీసికొని గోదావరీతీరమునకు వచ్చి 'అమ్మా!జానకీ! నీ పిల్లలకుఁ బండ్రెండవసంవత్సరము నిండుచున్నది గావున నీవిందుండి నీచేతితోఁ జిదిమినపూవులతో మీకులదైవతమగుసూర్యదేవునిఁ బూజింపుము. మామహిమవలన నిన్ను వనదేవతలైనను జూడఁ జాలరు. నీ కందఱును గనఁబడుచుందురు. నీ మాట లెవ్వరికిని వినఁబడవు. అందఱిపలుకులు నీకు వినఁబడును'అని సీతతోఁ జెప్పి, 'తమసా! నీవీ వైదేహితోనుం'డుమని నాకుఁ జెప్పి వెళ్లినది. ఇదిగోఁ జూచితివా! జానకి గోదావరి

మడుగులోనుండి పైకి వచ్చుచున్నది. ఆమె దేహ మెట్లు శుష్కించినదో చూడు. ఆ మొగము తెల్లపడి పోయి యూన వాలుపట్టు వలెను గాకున్నది. చూచితివా!'' యని యావ ద్వృత్తాంతము సెప్పి సీతను జూపింప, మురళయు 'నే నీవార్త లోపాముద్రకుఁగూడఁ జెప్పెద'నని తనపనిమీఁద వెడలెను.

పిదప 'నయ్యో! పూర్వయు సీతాదేవి పెంచిన యీ యేనుఁగు తనకరణితోఁగూడి నీటిలో నీఁదులాడుచుండ నేదో యింకొకగజము వచ్చి దీని నెదిరించుచున్న'దని యొకమాట వినఁబడ, సీత 'ఆర్యపుత్రా! నాపెంపుడుకొడుకును గాపాడుము' అని కేకపెట్టి 'అక్కటా! పంచవటిని జూచుటచేఁ జిరకాలము నలిఁగియున్నయాయక్షరములే చప్పున నోటికి వచ్చినవి. ఎంత భాగ్యహీనురాలను! హానాథా!' యని మూర్ఛిల్లె. తమసయు నామె నూఱడించునంతలో 'విమానమా! నీ విచ్చట నుండు' మని మఱియొకమాట వినఁబడ, జానకి తెలివొంది 'అమ్మా! మేఘగర్జనమువంటి యీపలుకు నాకానందముం గలిగించె' ననియెను. అందుకుఁ దమస పిల్లా! శ్రీరాముఁడు జనస్థానము నకు వచ్చెనని మనము వింటిమిగాదా?' యనుచుండ మరల 'ఆహా! ఇవియన్నియు మున్ను నాప్రియురాలితోఁగూడినివసిం చిన గోదావరీతీరప్రదేశములే' యనుచు శ్రీరాముఁ డచ్చటికి వచ్చెను. అతనిం చూచి సీత విచారముతో 'అమ్మా, మేనంత యుఁజిక్కిపాలిపోయినను, సహజము గంభీరముప్రసన్నమునైన యాముఖలక్షణముచే గుఱుతుఁపట్టఁదగినట్లుగానున్న యార్య పుత్రుఁడే యిటువచ్చుచుండె. నన్నుఁబట్టుకొను'మని యామెను గౌఁగిలించికొనెను. అంత రాముఁడా ప్రదేశ మిటునటుఁజూచి 'అయ్యో! యీ పంచవటిని జూచుటచే మనసులో నణఁగి

యున్నదుఃఖాగ్ని యొక్క పూఱుగాఁ బొంగి నన్ను మ్రింగుచున్నది. హాదండ కారణ్యావాసప్రియసఖీ!జానకీ!' యనిమూర్ఛిల్లె. అది చూచి సీత 'తల్లీ! నానాథుని లేవనెత్తు' మని కాళ్లమీఁదఁ బడ. నామె 'పిల్లా! నీచల్లనిచేతితో నీవే లేవదీయు'మని పంపెను. సీతయుఁ గన్నీరు విడుచుచు దగ్గఱకు వెళ్లి చేయి పట్టికొనఁగానే రాముఁడు తెలివి నెంది 'ఔరా! నాకుఁ బ్రాణము మరలవచ్చినది. నాకిపుడు మంచిగంధపుఁజిగుళ్లతడియో చంద్రకిరణముల సారమో కాని తగిలె విచార మోహమును బోఁగొట్టి యానందమోహమును గూర్చుచున్న'దన, సీత కొంచె మొత్తగిలి నిలుచుండెను. రాముఁడును దలఁచికొని 'జానకియే నన్నుఁ బట్టికొనినదా! కాదు. అయినఁ బిలిచె దను. "ప్రేయసీ! జానకీ! ఏది? ఇచట నుండినఁ బలుకదా?" యని ప్రలపించుచుండ, 'సీత 'హా! ఆర్యపుత్రా! నిన్నుఁ జూచుచు, జూడనిదాన నైతిని. నే నిందుండియు నీకు లేని దాన నైతిని. ఇఁక వేయి జన్మము లెత్తినను మరలఁ జూడరాని నీ రూపంబుఁ జూచుచు, మరల విన రాని నీయనురాగ వచనములు వినుచు నేను రాతిగుండెదాననై నీయెదుట నే యుంటి'ననుచు విలపించె. అంత నతండు మరల 'నోప్రేయసీ! నీవు తాఁకుటచే నాకు సుఖ మబ్బినది గాని నీదర్శనము మాత్రము లభించినదికాదు. అయ్యో! నా వెఱ్ఱి? నా ప్రియురా లెచ్చటి నుండి వచ్చు'నని కలవరపడుచుండ, 'నయ్యో! సీతపెంచిన యేనుఁగు నేదో మఱియొకమదగజ మెదిరించుచుండె'నని యొక మాట వినఁబడె. అంత రాముఁ 'డేది యాదుష్టగజ మెక్కడె క్కడ!' నని లేచి వెడలుచుండ, వాసంతి యెదురు వచ్చి 'దేవా! జయముజయ'మ నెను. రాముఁడు నామెనుజూచి 'నా

ప్రేయసిచెలికత్తెయగు వాసంతియా'యన, నామె 'దేవా! అది గో జటాయుశిఖరమునకు దక్షిణముగానున్నసీతాతీర్థము దగ్గఱ గజయుద్ధము జరుగుచున్న'దని, నతఁ 'డక్కటా! యీమాట లన్నియు మనసునకునాటుచున్న'వనుచు నచటికేగెను. సీతా తమసలు నాతని వెంబడించిరి. వాసంతియు సీతయేనుఁగుగెలు చుటను జూప రాముఁ డానందించె. సీతయుసంతోషించి'తమ సా! ఇది యిట్లున్నది. కుశలవు లెట్లుండిరోకదా! యక్కటా! నాకుఁ బతివిరహమే కాదు. పుత్రులయెడఁబాటు గూడ సంభ వించినది గదా! అయ్యో! యెంతనిర్భాగ్యురాలను! పెద్దపెద్ద కన్నులు, మల్లెమొగ్గలవంటి పాలపండ్లు, తెలిసీయుఁదెలియని ముద్దుపలుకులు గలనాబిడ్డలముద్దుమొగములు నితండుముద్దు పెట్టకొనకపోయినతరువాత నాపిల్లల నేను గనిననేమి! కనక పోయిన నేమి!' యని కన్నీరు పెట్ట 'బాలా! దైవానుగ్రహ మున నదియును సంభవించును, నీవు చెప్పినమాట నిజమే. సంతాన మనఁగా దంపతులమనస్సులకు విడిపోవని ముడి,తల్లి దండ్రుల యనురాగమునకుఁ బరమావధి. విచారపడకు. నీవట్టి ముచ్చట చూచెదవులే' యని యూఱడించె. అంత వాసంతి మున్ను వనవాసకాలమున సీత పెంచినకడిమిచెట్టును దాని మీఁది నెమలిని లేళ్లను సీతారాములు పరుండినపడకరాతిని రామునకుఁజూపి యతనికి విచారము కలిగించుచుండ, సీతయు వాని జూచి యేడ్చి'వాసంతీ! యివన్నియుఁ జూపుట విచార హేతువు గాని యానందకారణము గాదు,' అనుకొనుచుండె. వాసంతియుఁ 'సీతా! నీవు రామభద్రునియవస్థను జూడవైతివి గదా' యని విచారింప, నీమె 'సఖీ!అంతయుఁ జూచుచున్నదా నను. ఏమి చేయుదును! మే మొకరినొకరెడఁబాసి యుందు

మని యెవ్వఁ డెఱుఁగును' అని యేడ్చెను. తమసయు నామెను గాఁగిలించికొని 'పిల్లా! విచారపడక కన్నులార నీభర్తనుజూచి యానందింపుము. చెట్లు పూవులుచల్లుచు, మందమారుతము చల్లగాలి విసరుచు, శుకపికములు చక్కఁగాఁ గూయుచు, రాముని సేవించుచున్నవి చూడు'మనునంతలో, వాసంతి 'కుమార లక్ష్మణుఁడు కుశలముగా నుండెనా!' యని రాము నడిగి తెలిసికొని "దేవా! ఏమి నీవింత క్రూరుఁడ వైతివి! 'నీవే నాకన్నుల వెన్నెలవు, నీవే నాప్రాణము, నీవే నామనస్సు, నా బ్రతుకు నీతోనే యున్న'దనుచు, నీ వెంతో ప్రేమతోఁ జూచుకొనెడి యా జానకి నొక్కతె నెట్లడవిలో విడిపించితి" వని యేడ్వ, రాముఁ డామె నూఱడించెను. సీతయుఁ దనభర్తను గ్రూరుఁ డనుటకుఁ గోపగించుచు నేడ్చె. రాముఁడును గొంతవడి చింతించి, 'వాసంతీ! ఏమనుకొనిన నేమున్నది! నేను నిజముగాఁ గూళనే. నిండుచూలాలగు జానకిని రక్కసులు తినియుందు'రని పెద్దపెట్టున నేడ్చి "ఓ పౌరజానపదులారా! సీతయింటిలోనుండుట మీకుఁ గిట్టినదిగాదు. మీకై యాసతీతిలకమును గడ్డి పరకవలె నడవిలో విడిచితిని. నాయనాలారా! మీరు చల్లఁగా నుండుఁడు. అక్కటా! యీదుఃఖము హృదయమును బొడుచుచున్నదిగాని రెండుముక్కలు సేయదేమి! అయ్యో యీ పాడుదేహము మోహమునే చెందునుగాని ప్రాణమును విడిచిపెట్టదేమి!"యనివిచారింప, సీతయెంతయు దుఃఖపరవశయయ్యెను.

అంత వాసంతి రామునకు ధైర్యము సెప్పి దుఃఖముడిగింప యత్నించి మాతనిఁ గొంచె మావలకుఁ దీసికొని వెళ్లి 'రామా! సీత గోదావరికి వెళ్లి యిసుకతిన్నెలమీఁదహంసలు విహరించుట చూచి కొంచెము జాగు చేసి వచ్చి కోపగించి

నట్లు కనఁబడిన నీకు నమస్కరించినది. అదెక్కడనుండఁగానో తెలుగుదువా? ఈ పొదరింటిలో నున్నపుడే' యని దానిఁ జూప, రాముఁడు 'హా! జానకీ' ఇటు నటుఁ గనఁబడుచున్నదా నవు గాని కరుణించితివిగా'వని దుఃఖించి మూర్ఛిల్లె. సీతయు 'శీసి కఠినురాలా! విచారము పోఁగొట్టుటకు ముందుగా హృదయశల్య మయినవృత్తాంతమా తెలిపితివి! చాలులే' యని వాసంతిని నిందించి తమసచేఁ దెలుపఁబడి రామునిఱొమ్ముపై చేయి వైచునంతలో నతఁ డాచేయి పట్టికొని లేచి 'వాసంతీ! యిఁక భయము లేదు. జానకి దొరకినది. లేకున్న నాప్రాణ మెట్లు నిలుచు' నన, వాసంతి 'రామభద్రా! నాచెలికత్తె పోయినందుకే నాకడుపు దహించుకొని పోవుచుండ నీ వీ ప్రలాపమున మఱింత తగులఁబెట్టెదవేల' యనెను. సీతయు 'అయ్యో! దాఁటిపోఁదలచితినిగాని యీతనికిఁ జేయిచిక్కెన' దను కొనుచుండె. రాముఁడును 'వాసంతీ! నాది ప్రలాపమా? నేను పెండ్లినాఁడు పట్టుకొనినకరమే మరల నిపుడు పట్టువడినది. నీవు గూడనీచేయి పట్టుకొను'మనుచుండ, సీత తనచేయి విడిపించికొని తమసయొద్దకు వెళ్లెను. వాసంతియు 'అయ్యో! నిజముగానీతనికి వెఱ్ఱియెత్తిన'దని యేడ్చుచుండ 'నయ్యో! ప్రమాదము. నా ప్రియురాలిచేయిజాఱిపోయినది. 'హా!నిర్దయురాలా, సీతా! ఎక్కడ నుంటివి, ఇట్టియవస్థలో నన్ను విడిచి పెట్టెదవా'యని మొఱ్ఱ పెట్టెను. సీతయు' నాథా! నేనా విడిచిపెట్టితిని? నిన్నుఁజూచుచు నింకను జీవించియుండుటచే నిర్దయురాలనే, అక్కటా!' యని యేడ్చుచుఁ దమసచే శాంతినొందెను. వాసంతియు రాముని శాంతిపఱుప నతఁడు తెలివొంది 'ఔను నిజముగా సీత లేదు. ఉండినయెడల వాసంతికిఁ గనఁబడదా?

ఇది కలయా? నేను నిద్రింపలేదే. రామునకు నిద్ర యేమిటి!" యని మరల విలపింప 'నయ్యో! నేనార్యపుత్రుల మోసపె ట్టితి' నని సీత విలపించె. అంత వాసంతి 'దేవా! యిటు రమ్ము' అని కొంచె మావలకుఁ గొనిపోయి జటాయువు పడినచోటు జూపి సీతారాములకు మఱింత విచారము గలిగించె. అంత! రాముఁ "డయ్యో; పూర్వమువియోగము సంభవించినపుడు సుగ్రీవుని మైత్రియు నాంజనేయుని సాహాయ్యమును లక్ష్మణుని విలువిద్యనేర్పును జాంబవదాదుల తెలివియు నుపాయముగా నెట్లో యాకష్టము గట్టెక్కెను. వీనిలో దేనికిని శక్యముగాని యీ వియోగము దరించుట యెట్లు?" అని విచారించుచుండ, సీత 'తమసా? తొంటి వియోగము గౌరవింపఁబడుచున్నది. ఈవియోగము దాటరాని దనుటచే నేను నిరాశురాల నైతి', నని దుఃఖించె. అంత రాముఁడు 'వాసంతీ! యశ్వమేధము తల పెట్టితిని. ఇఁక నే నయోధ్యకుఁ బోవలయు'నన, వాసంతి 'రా మా! మరలఁ బెండ్లాడితివా!' యనియెను. దానికతండు 'లేదు లేదు. బంగారపుసీతబొమ్మయే నాకు ధర్మపత్ని' యని చెప్ప, నామె సంతసించె. సీతయు, 'హానాథా! నీగౌరవమునొందిన యాబొమ్మయే ధన్యురాలు. నన్నువిడిచితి వనెడికష్టము నా కిపుడు పోయిన' దని విచారసంతోషములను బొందుచుండ, వాసంతి 'రామభద్రా! కార్యహాని కాకుండఁగ నీక వెళ్లఁ దగినదియే' యన, రాముఁడును విమానమెక్కి వెడలెను. సీతయు 'హా ప్రియా! నీదర్శనమింతవఱకే'యని విచారించుచుఁ గుశలవులకుఁ బండ్రెండవయేఁడు నిండినందు కుత్సవము సేయుటకై భాగీరథికడకుఁ దమసచేఁ దీసికొనిపోఁబడెను.

ఒకనాఁడు వాల్మీకియాశ్రమమున సౌధాతకి యను బాలుఁడు తనమిత్రునితో 'నోరీ దాండాయనా! తెల్లగడ్డముల వారు వచ్చుటచే మనకు నేఁడాటవిడుపు వచ్చినది. ఇపుడెవఁడో ముసలివాఁడు కొండ ఱాఁడువారిని గూడఁ దీసికొని వచ్చెను. అతఁ డెవఁడురా!' యని యడుగ, నతండు నవ్వి 'ఓరీ! బుద్ధిహీనుఁడా పెద్దవారిని బరిహసించుచుంటివా? అతం డెవఁ డని నీయభిప్రాయము? ఋశ్యశృంగాశ్రమమునుండి వాల్మీకిని జూడ వచ్చిన వసిష్ఠుఁడు. కూడ నున్న స్త్రీలలో ముత్తయిదువ యాతనిభార్య యగునరుంధతి. మిగిలినముగ్గురు దశరథునిభార్యలు. ఇట్లు తెలివిలేని మాట లెప్పుడు పలుకకు' మని మందలించె. అంత సౌధాతకి 'ఓరీ వసిష్ఠుఁ డటరా! నే నేదో బెద్దపులి యనుకొంటిని. ఇతఁడు రాఁగానే పాపము! వుల్లావు పెయ్యను మడమడ మనిపించిరి' యని మరలఁ బరిహసింప, నతఁ డోరీ! శ్రోత్రియుఁ డైనయభ్యాగతున కెద్దుమాంసము గాని యావు పెయ్యమాంసము గాని వండించి పెట్టుట గృహస్థుల కాచార మని ధర్మశాస్త్రము చెప్పుచున్నది. ఇది తప్పుగా' దని చెప్ప, దానిపై నతఁడు 'దొరికితివిరా, వసిష్ఠునకు ముందుగా వచ్చిన జనకునకుఁ బెరుఁగు తేనె పెట్టియే యాతిథ్యము నెఱవేర్చి రేమి?' యనఁగా దాండాయనుఁ 'డౌను, మాంసము తిననివారికిఁ జేయఁదగిన మర్యాదయదియే. సీతాదేవి కాపత్తు సంభవించినది మొదలుగా నితఁడు మాంసభక్షణము విడిచిపెట్టి వానప్రస్థుఁడై చంద్రద్వీపములో నిష్ఠ తపస్సు చేసికొనుచున్నాఁడు' అని చెప్పె. అంత నతండు 'సరియే పోనిమ్ము. ఇతఁడును వియ్యపురాండ్రను గలసికొనినట్లుగా

నే మనము గూడ సహాధ్యాయులతోఁ గలసికొందము రా' యని వెడలిరి.

అంత జనకచక్రవర్తి యొకచెట్టునీడఁ గూరుచుండి 'అక్కటా! కూతునకు సంభవించిన లోకాపవాదముతోడి మహావిపత్తు నామనస్సును అంపమువలెఁ గోయుచున్నదిగదా! అయ్యో! యీకష్టము, ముసలితనము, ఈవ్రతములు నన్నియుఁ గలసి నాశరీరము నెండింపఁజేసినను నాప్రాణము మాత్రము పోక యున్నది. హా! భగవతీ వసుమతీ! నీవు కడుపారఁగన్నదియు నరుంధతీ వసిష్ఠుల నుతికెక్కినదియు రాముఁడు చేపట్టినదియు నగ్నిశుద్ధిఁ జెందినదియుఁ బతివ్రతయునగు నీకూఁతు కష్టము నీవెట్లు సహించితివి? ఎంత కఠినురాలవు?' అనుచు విచారించుచుండ నరుంధతియుఁ గౌసల్యయు గృష్టియను కంచుకిచే దారి తెలిసికొనుచు నచ్చటికి వచ్చుచుండిరి. జనకుఁడు కౌసల్యను జూచి 'ఔరా! మున్ను దశరథునియింటిలో లక్ష్మివలె నున్న యీమెను జూచుట నామనస్సున కెంతయుత్సాహకరముగా నుండెనో యిపుడు పుండుమీఁద నుప్పు చల్లినట్లుగా నంతకష్టతరముగా నున్న' దనుకొనుచుండఁ గౌసల్య యీతనిఁ జూచి గొల్లు మని యేడ్చెను. అంత నరుంధతి 'ఆహా! లోకములో నాపదవలనఁ గలుగుదుఃఖ మెప్పుడు నుండునదియే యైనను మిక్కిలికావలసినవారు కంటఁ బడినప్పు డది యోర్వరానిదై పొరలి పొరలి పైకివచ్చునుగదా'యని 'రాణీ! యేల గతించినదానికి విచారించెదవు? రమ్ము' అని యామెతో జనకుని సమీపింప, నతఁ డాయరుంధతికి నమస్కరించె. ఆమెయు జ్ఞానము వికసించుఁగాక యని దీవించె. అంత నతఁడు 'తల్లీ! యీమహారాజుగారితల్లికి గుశలమా' యని యడిగి, కోపము

తో 'మావంశమునఁ బుట్టినవారి కగ్నిశుద్ధియన నేమో! రా ముని చేనిట్లవమానము నెంది లోకాపవాదములపాలయితిమా!' యని నిష్ఠురోక్తులు పలికె. కౌసల్యయుఁ దలవంచికొనియుండె. అంత నరుంధతి "ఔను నిజమే. అగ్నియను నక్షరములు 'సీత' యనెడి రెండక్షరములకుఁ జాలవు. హావత్స! జానకీ! నీవు చిన్న దానవైన నేమి శిష్యురాలవైన నేమి? నీయగ్నిశుద్ధియే నీయెడ నాకు భక్తిని గలిగించినది. నీవు పసిదానవైనను లోకమునకు వందనీయురాలవు. సౌజన్యము గలవారి సుగుణములే పూజిం పఁదగినవిగాని వారి వయస్సును లింగమును గావు" అని సీతను బ్రశంసించుచుండఁ గౌసల్య కోడలిఁ దలఁచికొని మూర్ఛిల్లె. అంత జనకుఁ 'డిదేమి?' యని పరితాపపడ నరుంధతి 'ఏ ము న్నది? ఆప్తమిత్రుఁడ వయిన నీవు కంటఁబడఁగానే యీమెకు, బూర్వదినములుజ్ఞప్తికి వచ్చినవి. దానిచే స్మృతిలేని దయ్యె. ఆడువారిమనస్సు పువ్వుకంటెను మెత్తనిదిగదా' యనుచుఁ బట్టుకొనెను. జనకుఁడును దన కమండలువునందలినీళ్లు చల్లి 'అ క్కటా! వియ్యంకుఁ డనఁగా నతఁడే వియ్యంకుఁడు. నాప్రాణమే యతఁడు కాఁడా? ఏదయిన రహస్యముగాని వివాదప్రసంగము గాని యీమెయు నతఁడునుగూడ నాకుఁ జెప్పకుండగ నుండె డివారు కారు. నేనెట్లు చెప్పుదునో యట్లే సమాధానపడెడివా రు. ఇఁక నామాటలు చెప్పికొనినఁ బ్రయోజన మేమి?' యనుచు విచారించుచుండె. కౌసల్యయుఁ దెలివి నెంది "హా జానకీ, నీ వెక్కడనుంటివో కాని ముద్దులొలుకు నీమోము నాకన్నులకుఁ గట్టినట్లే యున్నది. 'ఈసీత మనకుఁ గూఁతురు గాని కోడలుగా' దని యెప్పుడును నీమామగారు నీమాటయే చెప్పుచుండెడివా రుగదా" యనఁ గంచుకి 'నిజము నిజము, తాను గన్నయయిదు

గురు బిడ్డలలోను రాముఁడే యతనికిఁ బ్రియపుత్త్రుఁడు. నలు గురు కోడండ్రలోను జానకియే యాతని కనుఁగుఁగోడలు' అనెను. జనకుఁడును దశరథుని దలఁచికొని దుఃఖించె. ఇట్లిద్ద ఱును విచారమగ్నులై యుండ నరుంధతి 'జరుగఁదగిన దేమో జరిగినది. ఇఁకముందు శుభమే కలుగు నని, మీకులగురువు చెప్పినమాట మఱచితివా' యని కౌసల్య నూఱడించుచున్నం తలో నొకధ్వని విని జనకుఁ 'ఓహో! నేఁడనధ్యయన మగు టచే విద్యార్థులు యథేచ్ఛముగా నాడుకొనుచుండిరి కాఁబో లు! ఔను వారిదే యీకలకల' మని యటు చూచెను. కౌస ల్యయు నటుచూచి 'చిన్నతనమే సుఖకరమైనది. అహో! ఆపిల్ల లలో నొకచిన్న వాఁడు బాల్యములో మారామచంద్రుఁ డున్న ట్లే యుండెనమ్మా! ఆకుఱ్ఱవాఁ డెవఁడో' యన, నరుంధతి తనలో 'భాగీరథిచెప్పిన బాలుఁ డితఁడే' యనుకొని 'ఔనౌను, ఆఛాయ, ఆమొగము, ఆరూపును సరిగా రామునిచిన్నతనమునే చూపుచుఁ గన్నులపండు వగుచున్న' దనెను. కంచుకియు 'నీ తఁడు క్షత్త్రియబ్రహ్మచారివలె నుండె'నన జనకుఁడు 'సత్యము, మెడలో లేడితోలుజందెము, మొలకు దర్భత్రాడు, కావిరంగు గోఁచి, ఒకచేతిలో మోదుగుదండము, ఇంకొకచేతిలో విల్లు, రెండుప్రక్కల నమ్ములపొదులు, ఇవన్నియుఁ జూడఁగా నితఁడు తప్పక రాజవటు వనియే తోఁచుచున్నది. ఆర్య గృష్టీ! నీవు వెళ్లి యాపిల్లవాని నిటు పంపి యీబాలుఁ డెవఁ డని వాల్మీకి నడిగి ర' మ్మన నతఁడు వెడలెను.

అంతఁ గంచుకిమాట వినిన లవుఁ డచ్చటికి వచ్చి 'మీ యందఱకు నమస్కారము' లని వినయము నూప నందఱును మాతేండ్లు వర్ధిల్లు మని దీవించిరి. పిదపఁ గౌసల్య యాతనిదగ్గ

అకుఁ బిలిచి తొడమీఁదఁ గూర్చుండఁబెట్టికొని 'ఆహా! నాయనా! నీవు సరిగా మా రామభద్రునివలెనే యున్నా' వని ముద్దాడి మొగమెత్తిచూచి 'రాజర్షి! చూడుచూడు. పిల్లవాని ముఖము కోడలిమొగమువలె లేదా?' యని యడుగ, నతం 'డమ్మా! చూచుచున్నాఁడను. రాముని మైచాయయు గూఁతు ముఖకాంతియు వీనియం దచ్చొత్తినట్లుగా సరిపడుచున్న'వని సీతను దలఁచికొని కన్నీరు విడిచె. కౌసల్యయు నంత 'నాయనా! మీయమ్మ యెక్కడనున్న'దని లవునిఁ బలుకరింప, వాఁడు 'మాకుఁ దల్లిలే'దని చెప్పె. అట్లయిన నిన్నెవరు పెంచుచుండిరని మరల నడుగ 'వాల్మీకి పెంచుచుండె'నని బదులు సెప్పె. అంతలో 'ఓ సైనికులారా! మీరెవ్వరునీయాశ్రమముదగ్గఱకుఁ బోవలదని చంద్రకేతు వాజ్ఞాపించుచున్నాఁ'డని యొకమాట వినఁబడ, జనకుఁ, 'ఓహో! యజ్ఞతురంగముతో వచ్చినాఁడు గాఁబోలు? చంద్రకేతువును జూడవలసినదే' యనియెను. అంత లవునకు జనకునకు నీక్రిందివిధముగా సంభాషణము జరిగినది.

లవు—ఆర్యా! చంద్రకేతు వెవఁడు?

జన—రామలక్ష్మణులను వినియుంటివా!

లవు—వారేకదా రామాయణ కథాపురుషులు?

జన—ఔను, ఆ లక్ష్మణునికొడుకే చంద్రకేతువు.

లవు—అట్లయిన నూర్మిళకొడుకు. అనఁగా జనకచక్రవర్తికి దౌహిత్రుఁడు.

జన—నీ కీకథ తెలిసెనేని చెప్పుము.

లవు—కొంతవఱకే యెఱుఁగుదును. దానిలోఁ గొంతభాగము నాటకముగా వ్రాసి మాగురువు భరతాచార్యు నొద్దకుఁ బంపెను.

జన—ఎందుకు?

లవు—అతఁడు దాని నచ్చరలచేఁ బ్రదర్శింపఁ జేయఁగలఁ డని. మా గురువున కీవిషయంబున మిక్కిలియాసక్తి. ఆ పుస్తకమును దనశిష్యులచేత నంపుచు మాగురువు వారితోఁ గూడ మా సోదరుని బంపెను.

జన—నీకుఁ దోఁబుట్టినవాఁ డొకఁడు గలఁడా?

లవు—ఆ! పూజ్యుఁ డగు కుశుఁడు గలఁడు.

జన—నీకంటెఁ బెద్దవాఁ డని తోఁచుచున్నది.

లవు—ఔను, పుట్టుకనుబట్టి పెద్దవాఁడే.

జన—అట్లయిన మీరు కవలపిల్లలా యేమి?

లవు—అవు నవును.

జన—నీ వెఱిఁగినంతవఱకుఁ గథ సెప్పుము.

లవు—'లోకాపవాదమునుబట్టి రాముఁడు సౌమిత్రిచే సీత నొక్కర్తను వనములోవిడిచిపెట్టించెను' ఇంతవఱకు వింటిని.

ఈప్రసంగ మంతయు విని జనకుఁడును గౌసల్యయు దుఃఖింప, లవుఁడు 'అమ్మా! వీరెవ' రని యరుంధతి నడిగె. ఆమెయు వారివృత్తాంతము చెప్పెను. అంత జనకుఁడు లోకుల యపవాదమునకును రామునితొందరపాటునకును సహింపఁజాలక కోపముతోఁ 'జూడుఁడు. వీరినిశపించియైనను విల్లెక్కుపెట్టియైనను నాదుఃఖము దీర్చికొనెద' ననఁగా, నరుంధతి 'రాజర్షి! శాంతింపుము. ఇది తగ'దని నివారించె. ఇంతలోఁ గొందఱు బాలురువచ్చి "ఓకుమారా! ఎవరో, 'అశ్వము,అశ్వ'మని కేక వేయుచున్నారు. దానిని మేము చూచినాము. దానికి వెనుక జల్లితోఁక యున్నది. నాలుగే డెక్కలున్నవి. పచ్చిక మేయుచున్నది! చూచెదమురా" యని లవునిచేయి పట్టికొని లాగఁగా,

నతఁడు వారి సెలవు తీసికొని వెళ్లెను. అంత లోపల గృష్టివచ్చి 'మహాత్మా! సమయము వచ్చినపుడు మీకే తెలియు నని వాల్మీకి మహర్షి చెప్పె' నని విన్నవింప, 'నిదేదో చిత్రముగా నున్నది. మనము వెళ్ళి యాతనినే చూచెద' మని యందఱును వెడలిరి.

అంత బాలురు 'కుమారా! యిదియే యశ్వము చూచితివా' యన, లవుఁడు 'చూచితిని. ఇది యశ్వమేధయాగము చేయ విడిచిపెట్టినగుఱ్ఱము' అని చెప్పుచుండ 'నిది యేడులోకములలో నొక్కఁడే వీరుఁడని ప్రసిద్ధికెక్కిన శ్రీరాముని యజ్ఞతురగ' మని యొక్క కేక వినఁబడెను. దాని విని లవుఁడు 'ఓరీ! పోండు. భూతల మరాజకమా యేమి? ఈమాట లేల? ఇదిగో గుఱ్ఱమును నేను దోలించుకొని పోయెదను జూడుఁడు. 'ఓ వటువులారా! యీగుఱ్ఱమును మంటిగడ్డలు ఱుప్పి మళ్లించి మన మోదుగుతోటలోనికిఁ దోలికొని పొం' డని వారిని బంపెను. అంత నొకసైనికుఁ డచ్చటికి వచ్చి 'ఓరీ చపలుఁడా! యేమంటివి? చంద్రకేతువు మిక్కిలి పౌరుషశాలి. నీమాటలు సాగవు. గుఱ్ఱమును విడిచిపొ'మ్మన, నతఁడు 'చీచీ!పో, వాఁడేమి చేయఁగలఁడు' అనుచుఁ జేతిలోనివిల్లెక్కుపెట్టి సేనమీఁదికి వెడలె. ఇట్లు గుఱ్ఱమును దోలికొనిపోవుటయు నొకపిల్లవాఁడు పరాక్రమించుటయు విని చంద్రకేతువు సైన్యమును గలసికొని 'సుమంత్రా! యెవఁడీపిల్లవాఁడు? మనసేనపై బాణవర్షము కురిపించుచున్నాఁడే'యన, నతం డింకనుజూచెదవేల! తర్వపడుము, మనసైన్యమును గాపాడుము. అదిగో సేన విరిసి పాఱిపోవుచున్నది. చాలవఱకు యోధులు మడసిరి' అని చూపి యరదమును వేగముగా నడపించె. అంతఁ జంద్రకేతువు సుమంత్రునివలన నాపిల్లవానిపే రెఱింగి 'ఓ లవకుమారా! పాఱి

పోవుచున్న సైనికులతో నేమి? నీకుఁ దగినవాఁడు చంద్రకేతువు వచ్చెను. ఇటు రమ్ము'ని పిలువఁగా, లవుఁడు 'సెబాసు! నిజముగా నీవు రఘువంశకుమారుఁడవే. ఇదిగో వచ్చితి'నని సమీపించె. సైనికవీరులును వెనుకనుండి వచ్చి లవుని ముట్టడించుచుండిరి. అదిచూచి చంద్రకేతువు 'ఓ రాజులారా! ఏనుఁగులు గుఱ్ఱములు రథములు నెక్కి తగుదు మమ్మాయని కాలిబంటయిన యొక్క చిన్నపిల్లవానిమీఁదికి గుంపుగూడి వచ్చుచుండిరా? ఇంతకంటె సిగ్గుగలదా?' యని మందలించుచుండ లవుడు వారిని జృంభకాస్త్రముచే బంధించెదనని తలఁచి వెనుకఁ దిరిగి యట్లుగావించె. అంత నెక్కడివా రక్కడనే నిలిచిపోవుటచూచి సుమంత్రుఁడు 'కుమారా! ఆ యస్త్ర మహిమ చూచితివా? అది తప్పక జృంభకాస్త్రముగాని మఱియొకటి గాదు. కాని, దీనిని గృశాశ్వుఁడు కౌశికుఁడు శ్రీరాముఁడు దక్కఁ దక్కిన యేమహామునులుగూడ నెఱుఁగరు. ఈయస్త్ర మీతని కెట్లు వచ్చినదో' యనుచుండ, లవుఁడు మరలి 'ఓయీ! నీవు నాయెడ దయ దలఁప నక్కఱలేదు. ఇఁక నీవుర'మ్మని పిలుచుచుఁ జంద్రకేతువును జూచి 'ఔరా! యీతనిఁ జూడఁగా నామనసులో నేదో యనురాగ మంకురించుచున్న'దనుకొని 'నైన నేమి? రాజులకు విల్లేగతి' యని నిశ్చయించుకొనెను. చంద్రకేతువును 'ఈతని మెత్తనిమేనిమీఁద బాణ మెట్లు ప్రయోగింపఁ దగును? ఈతనఁజూడఁగా నా మనస్సు కరఁగుచున్నదేమో? కారణము లేకుండఁగానే యొకనియం దొకనికిని బ్రేమపుట్టుట యనునది ప్రాణులకు సామాన్యమే. ఇంతకంటె నేమున్నది' యని తలఁచుచు యుద్ధముననే నిశ్చయించుకొనెను. సుమంత్రుఁడును లవునిజూచి కన్నీరు వెట్టి

'హృదయమా! పెడదారిఁ బడెద వేమి? ఎప్పుడో పాడుదైవము సీతను తీసికొని పోయియుండ నితఁ డామెపుత్త్రుఁ డెట్లగును?' అని దుఃఖించుచుండె. అంతఁ జంద్రకేతువు 'ఆర్యా! పాదచారితో రథస్థుఁడై యుద్ధముచేయరాదని పెద్దలు చెప్పుదురు గావున రథముదిగెద' ననఁగా, నతండు 'మేలుమేలు, కుమారా! ఇదియే సనాతనమైన సంగ్రామధర్మము' అని యాతనిఁ గౌఁగిలించుకొని 'బాలకా! మీతండ్రియే మొన్న మొన్నటివాఁడు. అతనిపుత్త్రుఁడవు నీవుకూడ నపుడే వీరధర్మములనంతటివాఁడవయితివి. ఔరా! నీచే దశరథవంశము వన్నెకెక్కినదిగదా' యనియెను. అంత నాబాలుఁ 'డార్యా! ఏమయిన నేమి? మా పెదతండ్రిగారికి సంతానములేదు గదా యని మిగిలిన మా తండ్రులు ముగ్గురు నెప్పుడును విచారింతురు. వంశములోఁ బెద్దవాఁ డనపత్యుఁడై యుండ నిఁక మావంశమునకుఁ బ్రతిష్ఠ యెట్లు వచ్చు?' ననుచుండ, లవుఁ 'డాహా! వీరరసములోఁ గరుణరసము కలియుచున్న' దనుకొనుచుండెను.

అంతఁ జంద్రకేతు నరదమునుండి దిగఁగా, లవుఁ 'డోయీ! నీవు రథముమీఁద నుండుటయే చక్కఁగా నున్న'దన, నతం 'డట్లయిన నీవుకూడ నింకొకరథ మెక్కు'మనె. అంత లవుఁడు 'వనవాసి నగునాకలవాటు లేదు. నీకున్న'దినీవు విడువ నేల' యనఁగా, సుమంత్రుఁడు 'కుమారా! యీబాలుని శౌర్యమును సౌజన్యమును రామభద్రుఁడు చూచెనేని మిక్కిలి సంతసించును జుమీ' యనెను. దానిపై లవుఁడు 'చంద్రకేతూ! ఆ రాజర్షి మిక్కిలి యోగ్యుఁడని వినుచుంటిమి. ఆతనిసద్గుణముల నెవఁడు గౌరవింపఁడు? గాని యశ్వరక్షకులు రాజ[illegible] స్కారముగా ననినమాటచే నింతవచ్చినదన[illegible]

తెలుగు విజ్ఞాన[illegible]

తండ్రిగారి ప్రతాపమునఁగూడ నీకసహనమా యేమి?' యని పలికె. దానికి లవుఁడు 'సహనముకానీ, యసహనముగానీ, దానితోఁ బనిలేదు. ఆ రాఘవరాజు మంచివాఁడు. సైనికుల మాటయే నిష్ఠురముగా నున్నది. ఒకపని చెడిపోవుటకుఁగాని నెఱవేఱుటకుఁగాని మాటయే మూలము. మాట మంచితన మెల్లయెడల మంచిది. అదియట్లుండ, 'మాతండ్రిగారి ప్రతాపమునఁగూడ నీకసహనమా యేమి?' యని నీవిపుడన్నదిమాత్ర మేమన్నమాట? రాజధర్మమొక్కచోటనే నిలిచియున్నదా యేమి?'యనియడుగ, సుమంత్రుఁడు 'కుమారా! నీవామహాత్ము నెఱుఁగవు కావున నతిప్రసంగము చాలింపుము. ఇవుడు సైనికులను గెలిచి శౌర్యముఁ జూపితివి. అది నీకుఁ దగును. కాని, పరశురాముని గెలిచిన మహావీరునియెడ నిష్ఠురముగాఁబలుకఁ దగ' దని మందలించె. అంత లవుఁడు 'అయ్యా! పరశురాముని గెలిచినమహావీరుఁ డని గొప్పమాట చెప్పితివే! బ్రాహ్మణులకు వాక్కునందును క్షత్రియులకు భుజములందును వీర్యముండు ననుట ప్రసిద్ధము గదా ! ఆయుధము చేతఁ బట్టినబ్రాహ్మణుఁ డగుటచేఁ బరశురాముఁ డుభయభ్రష్టుఁ డయ్యె. అట్టివానిని శ్రీరాముఁడు గెలిచె ననుట యేమిగొప్ప?' యని నవ్వుచుఁ బలుకఁగాఁ జంద్రకేతువు 'ఆర్యా సుమంత్రా! లోకప్రసిద్ధి కెక్కిన భార్గవునిపౌరుషమును సరకుసేయఁడు. జగమంతయు నభయమిచ్చి కాపాడిన నాయనగారిచరితమును లెక్క సేయఁడు. ఎవఁడయ్యా యీనూతనమహాపురుషుఁడు?' అని యడుగుచుండ, లవుఁడు 'ఓయీ! రఘువీరునిచరిత్రను మహిమను దెలియనివాఁడెవ్వఁడు? చెప్పఁదగిన దేమయినఁ గలదా? చెప్పుము. లేదా! నేనే చెప్పెదను వినుము. ఓహో! సుందుని

భార్యయగు తాటకను జంపి యడ్డు లేనికీర్తి సంపాదించిన పెద్దలు మహానుభావులు. వారిచరిత మటుండనీ. ఖరాసురునితో యుద్ధము చేయునపుడు మూఁడడుగులు వెనుకకు వేయుటయు వాలిని సంహరించిన నేర్పును జగమంతయు నెఱిఁగినదే. ఇంతకంటె వారిమహిమను జెప్పనేల?' యనఁగాఁ, జంద్రకేతు 'వోరీ! నీవు మర్యాద తెలియక మాటలాడుచుంటివా? చూడు' మని కోపము నూప, నతండు 'రారమ్ము. వట్టిమాటలేల' యనియెను. అంత నిరువురు సంగర మారంభించిరి.

అంత నాకాశమున విమానమెక్కి సంచరించుచున్న విద్యాధరుఁడు తన భార్యతో 'రమణీ! యావీరకుమారుల పోరు చూచితివా?' యన నామె 'నాథా! ఆకసము మఱియొక లాగునఁ గనఁబడుచున్న దేమి?' యని భయపడుచు నడిగె. అందు కతఁ 'డిది విశ్వకర్మశాణచక్రము త్రిప్పుటచే గిఱగిఱ దిరుగుచున్న సూర్యుని తేజస్సో లేక యీశ్వరుని ఫాలనేత్రము కాంతియో యగు' నని చెప్పి యాలోచించి 'ప్రేయసీ! కాదు కాదు చంద్రకేతుఁడాగ్నేయాస్త్రము ప్రయోగించెను. దాని మహిమ యిది. భయపడవలదు' అని యామెను జేరఁదీసి పట్టుకొని 'యబలా! చూచితివా! లవుడు ప్రయోగించిన వారుణాస్త్రముచే నది శాంతించినది. అక్కటా! అయిన నేమి? చంద్రకేతువు మరల వాయవ్యాస్త్ర మేసెను. ఆహా! విజ్ఞానము పరమాత్మయందలి వివర్తమునువలెనే యిది వారుణాస్త్రమునఁ బుట్టిన మేఘముల నెగురగొట్టినది చూడు' మని చెప్పె. అంత నామె, "నాథా! యెవఁడో దూరమునుండియే చేయి పైకెత్తి కండువా చెఱఁగు విసరుచు 'వద్దువద్ద'ని యుద్ధమును నివారిం

చుచు నావీరకుమారుల నడుమ విమానము దింపుచున్నాఁడు చూచితివా!" యన, నతఁడు చూచి 'ఆ శంబూకుని జంపి వచ్చుచున్న శ్రీరాముఁడే యితఁడు. చూచితివా! ఆతని మాట వినఁగానే వారిద్దఱు యుద్ధము చాలించిరి. పోనిమ్ము. రాముఁడు పుత్రప్రాప్తిచే నానందింపఁగలఁడు. ఇఁక మనము పోవుదము' అని వెడలిరి.

పిదప రాముఁడు చంద్రకేతువును దగ్గఱకుఁ బిలిచి కౌఁగిలించుకొని 'కుమారా! దివ్యాస్త్రయుద్ధమున నీవారోగ్యముగా నుంటివా' యని యడుగ, నతఁడు 'నాయనా! మంచిమిత్రుఁడు దొరకుటచే మిక్కిలి యానందముగానున్నది. నన్నెట్లుచూచు చుంటివో యీవీరబాలునిఁ గూడ నట్లే చూడఁదగునని నా విన్నపము' అనిపలికె. రాముఁడును లవునిఁజూచి 'ఆహా!లోక ముద్ధరింప జన్మించిన యస్త్రవిద్యయో సద్గుణముల రాశియో మూర్తీభవించిన రాజధర్మమో కాని యీబాలుఁడు సామాన్యుఁడుగాఁడు. ఈతని జూడఁగానే నాకు దుఃఖమంతయుఁ బోయి సంతోష ముదయించుచున్నది. దీనికిఁ గారణమేమో యూహింపరాదు'అని యాలోచించి, 'కారణమునకేమున్నది? స్నేహము నిమిత్తమును గోరునది గాదు. సూర్యదర్శనమునఁ దామర వికసించుటకును, జంద్రదర్శనమునఁ జంద్రకాంతమణి ద్రవించుటకును గారణ మేమున్నది?' అని మనసులోఁ దలంగుచుండె. లవుఁడును శ్రీరామునింజూచి 'మేలు.ధ్యానమునకును భక్తికిని మహత్త్వమునకును జోటయిన యీమహాత్మునిఁ జూడ గలిగితిని. నేఁడు సుదినము. ఈతనిజూచుటచే వైరమంతయుఁ బోయి శాంతి చేకూరినది. వినయము హెచ్చుచున్నది' అని యానందించుచు 'నోచంద్రకేతూ! వీరెవ్వరయ్యా' యని

యడిగె. 'వయస్యా! వీరు మాజనకపాదులు' అని యతఁడు పలుక, లవుఁడు 'నీవు వయస్యా, యంటివి గావున నాకుఁగూడ వీ రట్లే యగుదురు. కాని రామాయణకథాపురుషు లగు తంద్రులు నలుగురుగదా? వారిలో వీరెవరు? అని మరల నడిగె. అంత నతఁడు 'పెదతండ్రిగా' రని చెప్ప, లవుఁడు రఘువీరుఁడగు శ్రీరామచంద్రమూర్తియా? ఆహా! నాజన్మము సార్థకమయినది. తండ్రీ! మహాత్మా! వాల్మీకి శిష్యుఁడు నమస్కరించుచున్నాఁడు. వీని యపరాధమును మన్నింపు' మని మ్రొక్కెను. అంత నతఁడు లవునిఁ గౌగిలించుకొని 'కుమారా! నీవు చేసిన తప్పేమి?' యని యడిగి, యతఁడు 'మీసైనికులవలన మీప్రతాపమును విని పరాక్రమించితి'నని చెప్ప 'బాలకా! ఇది రాజుల కలంకారమే. తేజశ్శాలి యగువాఁ డితరుల తేజస్సు నోర్వకుండుట సహజమే'యని లాలించె. అంతఁ జంద్రకేతువు 'నాయనా! యీప్రియమిత్రుని తేజమున కుదాహరణము చూడుము. సైన్యమంతయు జృంభకాస్త్రముచే బలముచెడి నిశ్చేష్టమైపడియున్న'దని చెప్ప, రాముఁడు 'కుమారా! యీ యస్త్రము నుపసంహరింపు' మనియెను. లవుఁడు ధ్యానించి యట్లుచేసి 'తాతా! శాంతించిన' దని చెప్పెను. అంత రాముఁడు 'వత్స! ఈయస్త్రము గురుసంప్రదాయము ననుసరించి వచ్చునది గాని యూరక రాదు. నాకట్లే గురూపదేశమువలన వచ్చినది. నీ కెట్లు వచ్చినదో, చెప్పు'మని యడుగ, నతండు 'మాకు జన్మముతోనే వచ్చిన'దని బదులుసెప్పెను.

అంత రాముఁడు 'మీ రెంతమంది?' యని యడుగ, నతండు 'మేము కవలపిల్లల' మని చెప్పునంతలో 'దాండాయనా! ఏమంటివి? తమ్మునకును రాజభటులకును బోరాటము

వచ్చెనా? కానిమ్ము. నేటితో భూతలమున రాజపదము లేకుండఁగఁ జేయుదును జూడు' మనుచుఁ గుశుఁడు వచ్చుచుండ, రాముఁ డామాటలు విని 'యెవఁడీతఁడు! ఉఱుముఁబోలినయీ కంఠధ్వని వినుటచే నా మేను గగుర్పొడుచుచున్న' దనఁగా, లవుఁడు 'తండ్రీ! యతఁడు నాసోదరుఁడే, యిటు తీసికొని వచ్చెద' నని యావలకు వచ్చె. అంతలో విల్లు మ్రోఁగించుచు 'సూర్యవంశపురాజులతో సంగరమే సంభవించెనా! నావిల్లు సార్థకమే యగు' ననుకొనుచు, లవుని సమీపించి 'తమ్ముఁడా! యుద్ధము మాట నిజమా?' యని యడిగె. అతండును, గొంచెమేదో వచ్చినదిగాని రామాయణకథానాయకుఁడగు శ్రీరాముఁడిచ్చట నుండెను గావునఁ గొంచెము వినయ మవలంబింపు' మని చెప్పఁ, గుశుఁడు సంతసించి యణఁకువతో సమీపించి రామునకు నమస్కరించె. అతఁడును గుశునిఁ గౌఁగిలించికొని పుత్త్రాలింగన సుఖంబు ననుభవించి వారిం గూడి యొకచెట్టు నీడకుఁ జేరికూరుచుండి, యీ బాలుర రూపరేఖావిలాసములు చూడఁగా రఘుకులకౌమారమును సీత యాకృతియుఁ గూడ స్మృతికి వచ్చుచున్నవి. ఇంతకును సీత నెచ్చట విడిచితిమో! అదియే యీయాశ్రమము. వీరివయస్సును బండ్రెండేండ్లకు మించదు. జృంభకాస్త్రము మాకు జన్మముతోనె వచ్చినదని లవుఁడు చెప్పినమాటయు నిజమే యని నాకు గట్టినమ్మకము గలుగుచున్నది. ఏమనఁగా? చిత్తరువు చూచునపుడా దేవితో 'నీసంతానము నీజృంభకాస్త్రము లనుసరింపఁగలవు' అని వాగ్దానము చేసి యుంటిని. కావుననే వీరి కాయస్త్రములు లభించినవిగాని లేకున్న గురుసంప్రదాయము లేక యెట్లువచ్చును! ఇదిగాక కవలపిల్లల మని చెప్పుటయు నామనస్సునకు సరిపడు

చున్నది. ఏమనఁగా, కొంచెము సిగ్గుపడుచున్నను ప్రేమాతిశయమునఁ జనవు హెచ్చుగా నుండుటచే నొకనాఁటి శయన సమయంబున నాదేవిగర్భమును జేతితో నిమిరి చూడఁగా నిద్దఱుపిల్లలు పుట్టుదురేమో యని నాకనుమానము గలిగినది. తరువాతఁ గొన్నాళ్ల కాసతియు గర్భభారమునుబట్టి కవలలు పుట్టుదు రని చెప్పినది'' అని తలంచికొని కన్నుల నీరు వెట్ట, లవుఁడు 'మహాత్మా! యేమి విచారించెద' వనియెను. కుశుఁడును దమ్మునిఁ జూచి 'ఏమిరా నీ వెఱ్ఱి! రామాయణము చదివికొననివానివలె నిట్లడిగెద వేల? ఇక్కాలి ప్రియురాలు పతివ్రతాతిలకము నయినజానకిని విడిచిన యీతనికి దుఃఖము వచ్చుట యబ్బురమా?' యన, రాముఁడు మఱింత విచారించి 'కుమారా! రామాయణములో నేదైన నొకటి రెండుశ్లోకములు చదివి నన్నానంద పెట్టు' మనికోరెను. అంతఁ గుశుఁడు 'కేవలము భార్యయనియే కాక మంచితనమును బట్టియుఁ జక్కఁదనమును బట్టియు సీతయెడ రాముని కనురాగము హెచ్చెను. సీతయు రామునిఁ దనప్రాణముకంటె నెక్కువగాఁ జూచుకొనుచుండెను. వారి యన్యోన్యానురాగమును వారి హృదయములే యెఱుఁగును' అనునర్థము గల పద్యములను జదువఁగా, నతఁడు 'అక్కటా! యేదియిపుడు మనస్సును దహింపఁజేయునో యట్టికాలము తెలుపఁబడినది. ఆహా! దేవీ! నీ యనురాగమును దలఁచికొని యానందింపవలసి వచ్చినదా!' యని మనంబును విచారించె. అంత లవుఁడు 'చిత్రకూటమార్గమున సీతాదేవినిగూర్చి రాఘవుఁడు, 'దేవీ! నీకొఱకుంచఁబడినట్లుగా ముందు చాపరాయి కనఁబడుచున్నది చూడు' మని చెప్పినపద్యమును జదువ, రాముఁడు లజ్జపడి 'పిల్లల కేమియుఁ

దెలియదుగదా? హా దేవీ!' యని విచారించె. అంత నొకచా రుఁడు వచ్చి 'పిల్లలపోరాటమును విని యరుంధతీవసిష్ఠులు జన కుఁడు కౌసల్యాదిమాతలు వచ్చుచున్నా' రని విన్నవింప నతఁడు భయవినయములతో వారి కెదురుగా వెడలెను. కుశలవాదులు నాతని వెంబడించిరి.

అనంతర మొకనాఁడు వాల్మీకిమహర్షి తనయాశ్రమ మునఁ దానే రచియించిన యొక నాటకము నప్సరసలచే నభి నయింపఁ జేయఁదలపెట్టి యయోధ్యాపురములోని యెల్లజాతు లవారిని బిలిపించి తనమహిమచే సకలదేవాసుర సముదాయ మును రావించెను. అట్లు వచ్చిన పెద్దలనందఱను నాట్యశాల లోఁ దగినచోట్లఁ గూర్చుండఁబెట్టుటకు శ్రీరాముఁడు లక్ష్మణుని నియోగింప నతఁ డట్లు గావించి సభ సమకూర్చెను. అంత రాముఁ డచ్చటికి వచ్చి 'తమ్ముఁడా! నాట్యపాత్రములు సిద్ధ ముగా నున్నవిగదా? ఎల్లరు నుచితాసనంబుల నుండిరిగదా?' యని యడిగి 'ఈబాలుర నిద్దఱను జంద్రకేతువుతో సమాన ముగాఁజూడు'మని చెప్పి కుశలవులనాతని కప్పగించెను. అతఁ డును జిత్తమని 'ఆర్యా! యిదిగో రాజాసనము. దయ సేయు' మన, నతఁ డందుఁ గూర్చుండి 'యిఁక నాటక మారంభింపుఁ' డని యానతీయ సూత్రధారుఁడు రంగస్థలమునకువచ్చి 'భగ వంతుఁ డగు ప్రాచేతస మహాముని జ్ఞాననేత్రంబున గ్రహించి సమకూర్చిన కావ్యము నిం దభినయించుచున్నారము. అందలి గౌరవముచే మీర లందఱు సావధానముగానుండుఁ' డని సభ కుఁదెల్పినంత 'హా! ఆర్యపుత్రా! హా! కుమారలక్ష్మణా! నాకు దిక్కు లేదు. ఒంటిగా నీగాఢారణ్యమున నుంటిని. ప్రసవ వే దన సహింపఁ జాలను, పెద్దపులులుగూడ బొబ్బలిడుచున్నవి.

ఏమి చేయుదును? అయ్యో! ఇఁక గంగలోఁ బడుటయే గతి' అని తెరలోనుండి యార్తధ్వని వినఁబడెను. దానిపై సూత్రధారుఁడు 'శ్రీరామునిచే వనములో విడువఁబడిన సీతాదేవి ప్రసవ కష్టమును సహింపలేక గంగలోఁ బడుచున్న'దని చెప్పి వెడలి పోయెను.

అంతరాముఁడు 'దేవీ! సౌమిత్రినిజాడుము. హా దండకారణ్యవాసప్రియసఖీ! రాముఁడునీకిట్టిదుఃఖము గలిగించెనా?' యని దుఃఖింప, లక్ష్మణుఁడు 'అన్నా! యిది వాల్మీకిరచియించిన నాటకము గాని యిపుడు జరుగుచున్న వృత్తాంతముగాదు. విచారింపక చూచుచుండు'మని చెప్పెను. రాముఁడు 'ఆహా! ఔనౌను. ఈమాటుమనసు దృఢపఱచికొని సిద్ధముగానుండు' నని చెప్పుచుండ, నొక్కొక్కబిడ్డను జంకఁబెట్టికొనిన గంగా సుంధరలు సీతతో రంగస్థలముఁ బ్రవేశించి 'అమ్మా! సీతా! భయపడకుము. దైవవశమున రఘువంశము వృద్ధికెక్కినది. నీ కవలపిల్లలనుజూచికొను'మనుచు శిశువులనుజూపిరి. అంత సీత 'మగపిల్లలను గంటినా? అయిననేమి? హా! ఆర్యపుత్రా' అని మూర్ఛిల్లె. అంత రాముఁడు 'తమ్ముఁడా! నాకన్నులు చీకట్లు గ్రమ్ముచున్నవి. నన్నుఁ బట్టికొను' మనుచు నొఱగుచుండ లక్ష్మణుఁడు వచ్చి పట్టుకొని 'ఆర్యా! రఘువంశము వృద్ధి కెక్కినది లెమ్ము. చూడు' మనుచు నూఱడించె.

సీతయుఁ దెలివొంది తల్లిని గంగాదేవినిజూచి నమస్కరింప వారు దీవించిరి. మఱియుఁ దల్లియుఁ గూతురును కౌఁగిలించుకొని యేడ్చుచుండ గంగయూఱడించె. అంత భూదేవి, 'అక్కటా! నాబిడ్డ యెట్టికష్టములపాలయ్యె! కొంతకాలము రక్కసులలో మసలి మనోవేదనఁ బడెనా? ఇపుడు మరల నో

ర్వారాని వియోగ మనుభవించు చుండెనా? అయ్యో! దీనిఁ జూచుచు నే నెట్లుండఁగలను? ఔరా! ఔను గాని దేవీ! మీ రామభద్రున కిది తగునఁటమ్మా! అగ్నిసాక్షికముగాఁ బాణిగ్రహణము చేసి యిట్లు పరిత్యజింప వచ్చునా? దీని నిచ్చినవాఁడు జనకమహర్షియా! నేను గన్నదాననా! దీని సుగుణములు లోకప్రసిద్ధములా! వీనిలో నొక్కటైన నతనికిఁ బ్రమాణము గాకపోయెనా!' యనుచుఁ బరితపింప 'దైవయోగ మెవ్వరు తప్పింపఁగల' రని గంగ శాంతిపఱచె. సీతయు 'హా! ఆర్యపుత్రా! యెప్పుడైనఁ దలఁచుచుందువా?' యని శోకింప, 'నిఁక నీకార్యపుత్త్రుఁడెవఁ' డని తల్లి కోపించి పలికెను. అంత రాముఁడు 'అమ్మా భూదేవీ! యిపు డిట్టివాఁడ నైతిని. ఏమి చేయుదును?' అని యిచ్చట విచారించుచుండ, నక్కడ గంగ 'వసుమతీ! ఎఱుఁగనిదానివలె ని ట్లల్లునిపై గోపగింపఁ దగునా? ఎక్కడనో లంకలో నగ్నిశుద్ధిజరిగినదని చెప్పిన నిచ్చటివా రెట్లు నమ్ముదురు? కావున లోకములో నొక యపవాదము వ్యాపించినది. లోకారాధన మనునది యిక్ష్వాకువంశరాజులకు వంశక్రమాగత మయినధనమే. ఇట్టివిషమసంధిలో నా పిల్లవాఁడేమి చేయఁగలఁడో చెప్పు'మని పలుక, రామలక్ష్మణులానందించిరి. భూమియుఁ 'దల్లీ! క్షమింపుము. పిల్లలయందలి ప్రేమచే నట్లంటిని గాని రామభద్రునకు సీతయందుఁ గల యనురాగ మెఱుఁగనిదానను గాను. అతఁడును దాని విడిచినదిమొదలుగా శుష్కించిపోయి యెట్లో ప్రజలపుణ్యమువలనఁ బ్రాణములతోమాత్ర ముండె ననియు నెఱుఁగుదు' ననుచుండ, సీత 'అమ్మా నన్ను నీలో నణఁచికొను' మని తల్లిని వేఁడుకొనెను. అంత గంగ 'ఏమంటివి? వేయేండ్లు సుఖము

గా నుందుము. నీకేమి లోప' మన, భూమి 'బిడ్డా! నీబిడ్డలను జూచికొనుచుండు' మని చెప్పె. అంత సీత 'ఈ యనాథులను జూచికొనుచు నిర్భాగ్యురాలనై నే నెట్లుండఁగలను?' అనఁగా రాముఁడు 'హృదయమా! నీవు వజ్రముకంటెను గట్టిదానవై తివా?' యనుకొనెను. గంగావసుంధరలును 'అమ్మా! యిట్టి మాటలు పలుకకు. సుఖముగా నీపిల్లలు సనాథులై యుండ నిట్లనెదవేల? నిన్నుఁగాంగలించుటచే మాజన్మము పావనమైన దని తలఁచుచుండ నిన్ను నిందించుకొనెదవేల?' యని పలుక, సౌమిత్రి 'అన్నా! వింటివా?' యని రామునిఁ జూచె. రాముఁడును 'తమ్ముఁడా! మనమెఱుఁగనిదిగాదు. ఈమాట లోకము వినవలసినది' యనియెను. అంతలో దివ్యతేజస్సుతో జృంభకాస్త్రములాకాశమునఁ గనఁబడి 'దేవీ జానకీ! వందనము. చిత్ర దర్శన కాలమున శ్రీరాముఁడు మమ్ము నీ సంతానమున కొసం గెను. కాన నీకుమారులను సేవింప వచ్చితి' మని పలుక, సీత యానందించె, గంగావసుంధరలు 'ఓ యస్త్రములారా! మీకు వందనము. ఈపిల్లలు మిమ్ముఁదలఁచునపుడు వీరికి దర్శనమిండు పొండు' అని విన్నవింప, నవి యంతర్ధానమయ్యె. రామలక్ష్మ ణులు వెనుకటిమాట తలఁచికొని సంతోషించిరి. అంత జానకి 'అమ్మా! నా పిల్లలకుఁ గులోచితవిధు లెవ్వరు చేయుదు' రని విచారింప 'నీ కీసంశయమేల' పాలు విడిచినతోడనే నేను వీరిని దీసికొని వెళ్లి వాల్మీకిమహర్షి కొప్పగించెద'నని గంగచెప్పెను.

అంతలక్ష్మణుఁడు 'అన్నా! నేనునిజ మిట్లు గ్రహించితిని. ఇవన్నియు వినఁగా నీ కుశలవులే యామె కడుపున పుట్టిన పిల్ల లని తెలియుచున్న' దని విన్నవింప, రాముఁడు 'తమ్ముఁడా! నేను నట్లు నిశ్చయించుకొని మతి చెడి మూఢుఁడనై యుంటి'

ననెను. అంత భూదేవియు వెళ్లుటకు సిద్ధపడ, జానకి 'అమ్మా! నన్ను నీలో లయముచేసి కొను' మని కోరె. ఆమెయు 'బిడ్డా! నీ పిల్లలు పాలువిడుచువరకు నిందుండుము. పిదప నీ యిష్ట మొనరించెద,' నని చెప్ప, గంగయు 'నది యుక్తముగా నున్న' దనిసంతసించె. అంత రాముఁడు 'హా! ప్రేయసీ! జానకీ! సచ్చరిత్ర దేవతా సీతా! నీ విపుడు లోకాంతరమున నుంటి వని నిశ్చయ మైనది. అయ్యో!' యని మూర్ఛిల్లెను. అంత లక్ష్మణుఁడు 'దేవా మహానుభావా! ప్రాచేతసా! ఇది నీ కావ్యార్థము. ఇఁక మమ్ము రక్షింపు' మని ప్రార్థింపుడుఁ దెరలోనుండి 'ఓ జంగమస్థావరములారా! మర్త్యామర్త్యులారా! యిపుడు వాల్మీకిచేఁ బ్రతిజ్ఞ సేయఁబడిన యొక యాశ్చర్యమునుజూడుఁ' డని యొక వాక్యము వినవచ్చెను. ఇట్లంతర్నాటకము సమాప్తము కాఁగా గంగావసుంధరలు సీతను గంగలోనుండి పైకిఁ దీసికొని వచ్చి యరుంధతి కొప్పగించిరి. అది చూచి సౌమిత్రి యచ్చెరువొంది 'ఓ పూజ్యురాలా! ఇప్పటికి నార్యుఁడు తెలివి నెందకున్నాఁడు చూడు' మన, నరుంధతిచేఁ దెలుపఁబడి సీత వచ్చి రాముని స్పృశించెను. అతఁడును మూర్ఛదేఱి బంధువులను గురువులను భార్యను జూచి యాశ్చర్యపడఁగా, నరుంధతి 'కుమారా! ఈమె మీ కులదేవత యగుభాగీరథి' యనిచూపెను. ఆమెయు 'రామభద్రా! నీవు చిత్రదర్శన సమయమున 'అమ్మా! నీ వరుంధతివలెనే నీకోడ లగుసీతకు మేలు గోరుచుండు' మని యంటివి. కావున నాయప్పు దీర్చికొంటి' నని చెప్పె. మరల నరుంధతి 'బాలకా! ఈమె నీ యత్త యగుభూదేవి' యని చూపె. ఆమెయు ''రామచంద్రా! నీవు చిత్రదర్శనానంతరము 'భగవతీ! వసుమతీ! నీవుత్రికను నీవేచూచికొను

మని యుంటివి. నే నామాట చెల్లించుకొంటి" నని చెప్పె. రాముఁడును వారికిఁ గృతజ్ఞతతో నమస్కరింప, నరుంధతి 'ఓ పౌరజానపదులారా! గంగావసుంధరల పొగడ్తకెక్కినది తొల్లి యగ్నిహోత్రుని పరీక్షనునిలిచినది యిపుడు నేను సమర్పింపఁ దలచినది మహామునులచేఁ గీర్తింపఁబడినది యగుసీతను మరల శ్రీరాముఁడు పరిగ్రహించువిషయమున మీరేమి చెప్పెద' రని గట్టిగా నడిగెను. అంత నచ్చటివారెల్లరు 'శుభము శుభము' అని యేకగ్రీవముగాఁ బలుకుచు సీతకు వందనము లాచరించిరి. లోకపాలురు పూలవాన గురిసిరి. అరుంధతియు జానకిని శ్రీరామచంద్రున కొప్పగించెను. ఆ దంపతులును సౌమిత్రియు నరుంధతికి మ్రొక్కి దీవనలఁ బడసిరి. అంతలో వాల్మీకియు గుశలవులతో సమీపించి 'కుమారులారా! వీరు మీతల్లిదండ్రులు. ఇతఁడు మీ మాతామహుడు. ఇతఁడు మీ పినతండ్రి' అనుచు నాప్తబంధువులను బిల్లలకుఁ జూపెను. వారు నా పెద్దలకు నమస్కరించిరి. ఆ పెద్దలును బిల్లలను గౌఁగిలించికొని యానందించిరి. ఇట్లు యథోచిత సత్కారములు జరిగినపిదప వాల్మీకిమహర్షి 'శ్రీరామా! నీకు భార్యాపుత్రలాభము చేకూరినది. ఇం కేమి కావలయు' నని యడుగ, నతఁడు 'మహాత్మా! ఇం కేమి కావలయును? నీ వొనరించిన యీకథ లోకమును బవిత్రము సేయుఁగాక' యని కోరుచు నాతనియనుజ్ఞ గైకొని దారపుత్రామాత్యులతో నయోధ్యకేగి యందు సుఖంబుండెను.



శ్రీరస్తు.

ఓం నమః పరబ్రహ్మణే.

# III. మాలతీమాధవము

పూర్వకాలమునందు దేవరాతుఁడు భూరివసువు నను నిద్దఱు బ్రాహ్మణకుమారులును, కామందకి యనునొక యోగినియు నొకగురువునొద్దఁ జదువుకొనుచు మిక్కిలి మైత్రితో మెలఁగుచుండెడివారు. ఆ బాలు రిద్దఱు నొకనాఁడు 'మనము సంతానవంతుల మైనపుడు వియ్య మందికొనవలయు' నని ముచ్చటించికొని 'యటిసమయము వచ్చినపుడు మాకు నీవు సహాయురాలవు గావలయుఁ జుమీ' యని కామందకితోఁ జెప్పిరి. పిదపఁ గాలక్రమంబున విద్యావంతులు, యౌవనవంతులు, గృహమేధులు నైనవారిలో దేవరాతుఁడు కుండిననగరమున విదర్భరాజునొద్దను, భూరివసువు పద్మావతీపురమునఁ బద్మావతీరాజునొద్దను మంత్రులుగా నుండిరి. అంతఁ గొంతకాలమునకు దేవరాతునకు మాధవుఁ డనునొక పుత్త్రుఁ డుదయించి పెరుఁగుచుండె. ఇఁక గొంతకాలమునకు భూరివసునకు మాలతి యనుకూఁతురు పుట్టి వర్ధిల్లుచుండె. ఇట్లు వీరు సంతానవంతులయినసమయమునఁ గామందకి భూరివసునియింటఁ జేరి మాలతిని దానే తల్లివలెఁ బెంచుచుఁ గ్రమముగా నాబాలికకు విద్యాబుద్ధులు గఱపుచుండెను. ఇట్టితఱిని దేవరాతుఁడు తమ చిన్ననాటిమాట తలఁచికొని భూరివసునకు జ్ఞప్తి తెచ్చుటకై

యాన్వీక్షకి (రాజనీతి) నేర్చికొనుట యను నెపము పెట్టి తన తనయుఁ డగుమాధవునిఁ బద్మావతీపురంబునకుఁ బంపెను. తండ్రి యానతిచొప్పున నప్పురంబున కేగి విద్యాభ్యాసము చేతనే కాక వినయాది సుగుణసంపదచేఁగూడఁ బేరు గాంచు చున్న యతనికి మకరందుఁ డనునొక మంత్రికుమారుఁడును గలహంసుఁ డనునొక యన్యజాతీపురుషుఁడును బ్రాణమిత్రు లైరి. అపుడు మాలతియు నందనుఁ డనురాజమంత్రికిఁ జెల్లె లగు మదయంతికతోను, మందారిక యను నన్యజాతికన్య తోను, లవంగిక యను సామాన్యకన్యతోను మిక్కిలి మైత్రి గలిగియుండె, ఇట్టియెడఁ దనబాల్యమిత్రు లగుభూరివసు దేవ రాతులకోరిక నెఱవేర్పఁ దలఁచుచున్న కామందకి తనశిష్యు రా లైనయవలోకితతో 'నీ వెట్లయిన మాలతీ మాధవులకుఁ బరస్పరము సమావేశము గలిగించి వారి కనురాగము పుట్టు నట్లు చేయవలయు'ననియుఁ, దన చెలికత్తె యగుబుద్ధరక్షితతో 'నీ వెట్లయిన మదయంతిక మకరందునిఁ బెండ్లాడఁ బ్రయత్నిం పవలయు' ననియుఁ జెప్పి వారివారి సంఘటనమునకుఁ బూని కొనియుండె. ఇంతలో మాధవుని సౌందర్యమును సుగుణంబు లను జక్కఁగ నెఱింగి తనకొమార్తె నతని కిచ్చి పెండ్లి సేయఁ దలఁచియున్న భూరివసువు నొకనాఁడు పద్మావతీరాజు తననర్మ సచివుఁ డగునందనుని నిర్బంధముచేఁ బిలిపించి 'అమాత్య వర్యా! నీ పుత్రికను నందనున కిచ్చి పెండ్లి సేయు' మనికోరె. అంత నమ్మంత్రి 'స్వీయకన్యాజనంబు నొసంగ దేవర యే కర్త' యని ప్రౌఢముగా సమాధాన మిచ్చి యతని నానందపెట్టి యింటికివచ్చి 'నీ వెట్లయిన మాలతీమాధవులకుఁ జౌర్యవివా హము జరిగింపు' మని కామందకిని బ్రోత్సాహపఱిచెను.

ఇది యిట్లుండ నవలోకిత మాధవునొద్దకు వెళ్ళి యాతనితో భూరివసుని యింటి ప్రక్కనున్న రాజవీథిలోఁ బలుమారు నడచునట్లు చెప్పి యతఁడు వచ్చిపోవుచున్నపు డెల్ల మాలతి యతనిని జూచునట్లుగాఁ జేయుచుండె. ఇట్లు పెక్కుసారులు మాధవునిఁ జూచినమాలతి యతని సౌందర్య మునకు మెచ్చికొని ప్రేమించి యాతనిరూపము నొక్క పట మునఁ జిత్రించికొని యానందించుచుండెను. ఒకనాఁ డాచిత్ర పటమును లవంగిక సంగ్రహించి మాధవున కందఁజేయు మని చెప్పి మందారికచేతి కిచ్చి పంపెను. అదియు దానిం గొని వచ్చి తనప్రియుఁడగు కలహంసునిచేతి కిచ్చెను. అంత నొక నాఁడు మదనోద్యానమున మన్మథోత్సవముఁజూడ మాలతి చెలికత్తెలతోఁ గూడ నచ్చటికి వెళ్లఁ దలఁచి యున్నదని యెఱిఁగిన యవలోకిత వారికంటె ముందుగానే మాధవు నచ్చటికి వెళ్ళియుండునట్లు చేసెను. అతఁడు నట్లు వెళ్ళి యావనంబున నొక పొగడచెట్టుక్రిందఁ గూర్చుండి క్రిందఁ బడియున్న దానిపువ్వులను దండగ్రుచ్చుచుండఁగా నేనుఁగు నెక్కి మాలతి చెలులతోఁ గూడ నచ్చటికి వచ్చి యుత్స వముఁ జూచి యానందించి యందుఁ బూవులు గోసి కొనుచు నడుమ నడుమ సాభిప్రాయముగా మాధవునిఁ జూడసాగెను. అతఁడును మాలతిని జూచువేడుకలో నెట్లో దండను గ్రుచ్చి మెడలోఁ దాల్చెను. అంతఁ గొంత సేపునకు మాలతి మరల సఖులతో నింటికి వెడలఁగా లవంగిక పూలు గోయునెపమున మిగిలి మాధవునిదగ్గఱకు వచ్చి 'అయ్యా! యీ పూలదండ గ్రుచ్చుట మిక్కిలి నిపుణ ముగా నున్నది. మాచెలియు నీ వ్యాపారము చక్కఁగా

నెఱుఁగును. ఈ పూలమాల యామె ధరింపఁ దగినట్లున్న దని చెప్పఁగా నతఁడును దానివలన మాలతీవృత్తాంతము దెలిసికొని యా పుష్పమాలికను దానికిచ్చెను. అదియు దానిఁ గొనివచ్చి మాలతికి సమర్పించెను.

తరువాత మకరందుఁ డచ్చటికి వచ్చి కూరుచుండి మాధవునివలనఁ బూలదండవృత్తాంతము వినుచుండఁగాఁ కలహంసుఁడు మాధవుని చిత్రపటము తీసికొనివచ్చి దానిం జూపి యిది మాలతి వ్రాసినదని చెప్పెను. అదివఱకే మాలతియెడఁ దలఁపు గలిగియున్నమాధవుఁ డామాట వినఁగానే మఱింత చిత్తవికారమునుజెంద, మకరందుఁ 'డోయీ! నీవుఁగూడ నీపటమందే మాలతిరూపము లిఖయించి యానందింపరాదా?' యని యాజ్ఞాపించెను. అతఁడు నట్లే యని చేయి వణఁకుచున్నను గన్నుల నానందబాష్పము లొలుకుచున్నను నెట్టకేలకు మాలతిరూప మందు వ్రాసి దానిక్రింద 'లోకములో నత్యంతము చిత్తము రంజింపఁజేయునవి చంద్రకల మొదలగునవి యనేకములు గలవు గాని నాకీజన్మమున కెల్ల నానందము గలిగించున దీ మాలతీముఖవీక్షణ మొక్కటియే' యను నర్థము గల పద్యము వ్రాయఁగా, మకరందుఁడు చిత్రలేఖనమందును నాశువుగాఁ బద్యము గూర్చుటయందును నాతనికిఁగల నైపుణ్యమును బొగడుచుండెను. అంతలోఁ గలహంసునియొద్దనుండి మరలఁ బటమును గొనిపోవుటకై మందారిక యచ్చటికి వచ్చి వారి నడిగి దానిఁ దీసికొని దానియందు వ్రాయఁబడిన మాలతీప్రతిరూపమును జూచి యానందించి యింటికివచ్చి యాచిత్రఫలకము లవంగిక కిచ్చెను. తరువాత మాధవాదులు నింటికి

వచ్చిరి. మకరందుఁడు నీవృత్తాంత మంతయుఁ గామంద కికిఁ దెల్పెను.

లవంగికయుఁ బొగడపూలదండను జిత్రపటమును దీసి కొనివెళ్ళి మేడమీఁద నొంటిగాఁ గూరుచున్న మాలతి కీయఁగా నామె యాదండ మెడలోవైచికొని పటమును జూచి యానందించి క్రింద వ్రాయఁబడియున్న పద్దెము చదివి కొని మాధవుని దలఁచికొని యాతని సౌందర్యాదిగుణములఁ బేర్కొని వగచుచుండునంతలోఁ గామందికి యవలోకితతోఁ గూడ నచ్చటికి వచ్చెను. అంత మాలతి యామెనుజూచి 'అమ్మా! కుశలమా' యని యడుగఁ గామందకి, రాజుతో భూరివసువు చెప్పినమాట రెండర్థములతో నొప్పుచు రెండు లోకముల సమ్మతముగానున్నదని యెఱిఁగినదయ్యు నెఱుఁగని దానివలె 'సంసారులతో స్నేహమొనరించిన నాబోఁటి సన్న్యాసినికిఁ గుశల మెట్లని మనోవైకల్యము నెందినట్లు మాటలాడఁగా, మాలతి 'అమ్మా! నీ వేమిచేయుదువు? రాజును సంతోషపెట్టుటయే నాతండ్రి కిష్టము గాని నందనుఁ డెట్టివాఁడయిన నతని కేమి? ఇంతకును నాయదృష్ట మిట్లుండఁగా నతఁ డేమిచేయు' నని విచారించె. అది విని లవంగిక 'తల్లీ, మామంత్రిపుత్రి నెట్లయిన రక్షింపు' మని వేఁడుకొన నామె 'తండ్రి కలఁడు, లేక భగవంతుఁడు గలఁడు. నే నేమి చేయుదును?' అని భూరివసువు రాజుతోఁ జెప్పినమాటను నిందించుచు మాధవుని కులశీలాదులు వర్ణించి మాలతికి మాధవునియెడ మఱింత యనురాగము గలిగించుచు 'నాబోఁటిది చెప్పఁ దగదు గాని యెుత్తముమీఁద నిట్టికార్యములు మహాసాహసమువలనఁ గాని నెఱవేఱ' వని చెప్పెను. అంత

నవలోకిత 'అమ్మా! మాధవుఁ డక్కడఁ బరితాపపడుచుండఁ
మన మిక్కడ జాగుచేయరాదు పోదముర'మ్మనఁ గామందకి
మాలతి నూఁటడించి వెడలెను. మాలతియు మేడ దిగి
క్రిందికి వచ్చెను.

ఇట్లుండ నొకనాఁడు కృష్ణచతుర్దశి యగుటచే శంకర
పురంబున కీశ్వరారాధనము చేయ నేఁతల్లితో మాలతిగూడ
వెడలుచున్నదని యెఱింగి కామందకి 'వారికంటె ముందు
గానే వెళ్లి శంకరపురసమీపమందలి యుద్యానమున నుండ
వలసిన' దని మకరందునిచే మాధవునకు వృత్తాంత మంపెను.
అతఁడు నట్లే వెళ్లి యొకచెట్టుమఱుఁగున నుండ మాలతీలవం
గికలు కామందకితో వచ్చి కొంతసేపు పూవులుఁగోసిరి. అంతఁ
గామందకిఁ మాలతిని బిలిచి 'పూవులు కోసి కోసి యలసి
తివి, ర' మ్మని యొకచోఁ గూర్చుండఁ బెట్టి మాధవుఁడు విను
నట్లుగా.'నీకై మాధవుఁడు విరహతాపపడుచుండెను. అతని
యవస్థ చూడఁగా జీవితసంశయము గలిగించుచున్న' దని
చెప్ప, లవంగిక 'అయ్యో! తల్లీ! ఈ మాలతి యాతనికై
పడుచున్న పరితాపము నేనెఱుఁగుదును. ఆ భగవంతుఁ
డెఱుఁగును' అని యామె మనోవేదనఁ దెలుప మాధవుఁడు
విని యపరిమితానంద మొందెను.

ఇంతలో బుద్ధరక్షిత పరుగెత్తుకొనివచ్చి 'అయ్యో!
మదయంతిక పెద్దపులి బారిఁబడిన' దని మొఱ్ఱవెట్ట మాధవుఁ
డీవలకువచ్చి 'ఎక్కడెక్కడ' నని కేకలుపెట్టెను. అదిచూచి
మాలతి భయసంతోషములు నెందె లవంగితో 'సఖీ! యీతఁ
డాపులియొద్దకుఁ బోఁడు గదా!' యని యడుగుచుండ, నతం
'డక్కటా! నేను దూరమందున్న వాఁడను. అపుడే మదయం

తికను బులి సమీపించినది. ఏమి జరుగునోకదా!' యని యల జడి పడుచుండునంతలో దైవవశమున వచ్చిన మకరందుఁడా శార్దూలముతోఁ గలియబడి పోరాడి దానిఁజంపి మదయంతికను గాపాడియుఁ బులిగోళ్లు గ్రుచ్చుకొనుటచే మేను తెలియక భూమిపైఁ బడియె. ఇంతలో నచ్చటికి వేగముగాఁ బరుగెత్తి వచ్చిన మాధవుఁడు మిత్రుఁడు సొమ్మసిల్లుట గని తానుగూడ మూర్ఛిల్లె. ఇది యంతయుఁ గన్నులారఁ గనుచున్న కామందకి మాలతీలవంగికలతో నచ్చటికి వచ్చి వా రిరువురిపైఁ గమండలూదకము చల్లఁగా మాలతి మాధవునకు మదయంతిక మకరందునకును విసరుచు వారిని లేవనెత్తిరి. అంత వా రిరువును దెలివిసెంది లేచిరి. మదయంతిక, తనతో నిది వఱకు బుద్ధరక్షిత వర్ణించుచువచ్చిన మకరందుఁడు తన్ను రక్షించినందుకును బులిచే దెబ్బలు తిని యతఁడు జీవించినందుకును దైవమును నుతించి మనస్సులో నానందించెను. కామందకి మదయంతికను గాపాడినందుకు మకరందునిఁ బొగడి 'వత్సా! మాలతికిఁ బ్రీతిదానము సేయు' మని మాధవునితో ననఁగా నతఁ 'డమ్మా! నన్ను మూర్ఛనుండి తేర్చిన యీ కన్నెకు నే నధీనుఁడనే' యని పలికె. వీరిట్లు మాటలాడుకొనుచుండఁగా నొకమనుష్యుఁ డచ్చటికి వచ్చి మదయంతికను జూచి 'అమ్మా! రాజుగారు తనకు మాలతి నీయ నిశ్చయించినారనియుఁ గావున శీఘ్రముగా నింటికి రావలసినదనియు నీ యన్న యగు నందనుఁడు నీతోఁ జెప్పుమనియె'నని విన్నవింప, మకరందుఁడు "మిత్రమా! నేనీవార్తయే ముందుగా నీతోఁ జెప్పుటకై వచ్చుచున్నంతలో నీ మదయంతికను బెద్ద పులినోటినుండి విడిపింపవలసివచ్చె" నని మాధవునితోఁ బలి

కేను. మదయంతికయుఁ 'చెలీ! మన మిరువురము చిరమైత్రి గలిగి యున్నందుకు నీవు మా గృహమునకు భూషణంబ వగుచున్నావు. ఇది యంతయు సంతోష' మని మాలతిని మఱుఁగుపఱిచి 'మాలతి నీకు వదినెయగుట నీపుణ్యము మంచి'దని మదయంతికతోఁ బలుక నామెయు 'నిదియంతయు నీదయ' యని కామందకిని బొగడి 'మకరందుని మరల నెప్పుడు చూతునోగదా!' యని తలఁచికొనుచు బుద్ధరక్షితతోఁగలిసి గృహంబున కేగెను.

అంత మాధవుఁ డీవార్త విన్నందునఁ బరితపించుచు 'నేఁటితో నా యాశాతంతువు తెగిపోయిన' దని దుఃఖింపఁ గామందకి "కుమారా! తేల విచారించెదవు. ఇది జరుగునట్టి పనిగాదు. రాజయిన నేమి? ఒకనికన్న నింకొకఁ డెట్లు దార పోయఁగలఁడు! భూరివసువు తనతోఁ జెప్పిన 'స్వీయకన్యాజ సంబునొసంగ దేవరయే కర్త'యను మాటయొక్క నిశ్చయాభిప్రాయమును రాజు తెలియక యట్లనెనేమో కాని, తనకు మాలతి నిజకన్యలలోనిదా! కావున నీవధైర్యపడకుము. నా ప్రాణము పోయినను సరియె కాని మిమ్మిరువురను గూర్పక మానను' అని ప్రతినసల్పెను. మకరందుఁడు 'తల్లీ! మాభారమంతయు నీదే' యనియెను. అంత రాణిగారి సెల వయినదని యొక పరిచారకుఁడు వచ్చి చెప్పఁగా మాలతి సానురాగముగాఁ దిరిగి తిరిగి మాధవుని జూచుచుఁ గామందకితో నింటికేగెను. మాధవుఁడును 'మిత్రమా! నా కోరిక నెఱవేఱునవెడియాశ పోయినది. నీవు మదయంతికను రక్షించితివి గావున నామె యెట్లయిన నిన్నే వరించును. కానీ, యిదియైనను మంచిదే'

యని కొంత తలంచి యీ వియోగబాధకంటె మరణమే మేలని యెంచి శ్మశానవాటికకుఁబోవ నిశ్చయించుకొని మకరందునితోఁగూడ వరదాసింధుసంగమమున స్నానమున కేగెను.

పద్మావతీపురమునకు సమీపమున నున్న శ్మశానవాటికలోఁ గరాళశక్తిగుడి యొకటి గలదు. అఘోరఘంటుఁడను నొక కాపాలికుఁ డాశక్తి నర్చించుచు నామెకు స్త్రీబలి నీయఁదలఁచి యీ నగరమందలి యొక కన్యారత్నమును దీసికొనివచ్చుటకై యొకనాఁడు తనశిష్యురా లగు కపాలకుండలను బంపఁగా నది వెళ్ళి మేడమీఁద నిద్రపోవుచున్న మాలతి నెత్తికొని వచ్చి యామెకు వధ్యచిహ్నముల నేర్పఱిచి పూజాద్రవ్యంబులు సమకూర్చుచుండెను. మాలతియు దనయవస్థను దలఁచికొని "హా నాయనా! దయాహీనా! హా! అమ్మా! హాతల్లీ కామందకీ! హాసఖీ లవంగికా! నేటితోసరి. ఇఁక మీకంటఁ బడ"నని యేడ్చుచుండె. ఇంతలో నదివలకే 'ఓ భూతములారా! నిష్కపటమైనదియు శస్త్రపూతముగా నిదియుఁ బురుష దేహమునుండి తీయఁబడినదియు నగుమాంసమును గొనుఁడు, కై కొనుఁ' డని కేక లిడుచు మహామాంసవిక్రయము పేరఁ బ్రాణపరిత్యాగముచేయ నచ్చుటికి వచ్చిన మాధవుఁ డీయార్తధ్వని విని 'అక్కటా! యిది మాలతి కంఠస్వరముగా నున్న' దని యానవాలువట్టి యాధ్వని వచ్చినచాయనే మహావేగముతోఁ బరుగెత్తుకొనివచ్చి "పాపాత్మా! ఉండు ముందు'మని యదలించుచు నప్పుడే పూజ చాలించి మాలతిని శక్తికర్పింప సిద్ధపడుచున్న యఘోరఘంటుని చేతిలోని కత్తి లాగికొని 'ఓరీ! నరాధమా! యీ త్రిలోక

సుందరిని జంప నీకుఁ జేయి యెట్లువచ్చె? సంసారము నసార ముగను లోకమును నిరాలోకముగను బంధుగణమును మరణ శరణముగను గందర్ప నదర్పునిఁగను మానవనయన నిర్మా ణమును ఫలహీనముఁగను జగంబును జీర్ణారణ్యముగను జేయ నీకు మన సెట్లొప్పె?' నని నిందించుచుండ, మాలతి 'నాథా! రక్షింపు' మని మాధవుని గాఁగిలించికొనెను. అంత వారిరువురును దైవయోగమున నచ్చటికి వచ్చుటను గూర్చి పరస్పరము చెప్పికొనుచున్నంతలోఁ 'గపాలకుండల మాలతి నెత్తికొని పోయిన' దని దివ్యదృష్టిని గ్రహించిన కామందకి పంపిన పరిచారకు లామెను వెదకుచు నచ్చటికిఁ జేరిరి. మాధవుఁడును మాలతిని వారి కప్పగించి యఘోర ఘంటుని సంహరించిన పిదప నందఱును బురంబున కేగిరి.

తరువాత రాజు నందనునిఁ బెండ్లికొడుకుం గావించి భూరివసునియింటికిఁ బెండ్లికి వచ్చుటకై సన్నాహము సేయు చుండె. ఈ సమయమునఁ గామందకి మాధవమకరందులను ముందుగాఁ బురదేవతాలయమునకు వెళ్ళియుండు నట్లాజ్ఞా పించి నిర్విఘ్నముగాఁ బెండ్లి సాగుటకై ముందుగా గ్రామ దేవతకు మ్రొక్కింపవలయు ననెడిమిష పెట్టి లవంగికతోఁ గూడ మాలతి నాగుడికిఁ దీసికొని వచ్చుచుండెను. ఇంతలో భూరివసువు 'దేవతాలయముననే తనకూఁతునకు వివాహాలం కరణ మొనర్పవలయు' నని వస్త్రాలంకారాదు లిచ్చి యొక పరిచారకుని వెనుకఁబంపెను. వాఁడును వేగముగా వచ్చి గుడిసమీపమున వారిని గలిసికొని యావస్తువులను గామం దకిచేతి కీయఁగా నామె వానిని బరిశీలించుచు జాగు చేసి ముందుగా మాలతీలవంగికలను గుడిలోనికిఁ బంపెను. వారు

నట్లు వెళ్ళినపిదప లవంగిక పూజాద్రవ్యములు మాలతిచేతి
కిచ్చి 'దేవిని బూజింపు' మని చెప్పిన నామె నందనునిఁ
బెండ్లాడ నిష్టములేనిదై యేడ్చి 'యోసీ! నన్నేల బాధ
పెట్టెదవు? నామరణ మంగీకరింపు' మని దాని కాళ్లయొద్ద
సాష్టాంగపడెను. అంత లవంగిక, గర్భాలయములో నుండి
తమమాటలు వినుచున్న మాధవుని రమ్మని సంజ్ఞచేసి తా
నున్నచోట నాతని నిలిపి తా నావలకు జరుగఁగా, నతఁడు
'సరినమే నీయిష్ట మొనరింపుము. నా కాలింగనంబి'మ్మన
మాలతి లవంగిక యనెడియూహతోనే లేచి మాధవునిఁ
కౌఁగిలించికొని 'చెలీ! నాప్రాణప్రియునితో నాయూస బడు
గంటిన' వని మనవిచేయుము. అతఁడు గ్రుచ్చిన యీ
పొగడపూలదండను నాకు బదులుగాఁ జూచికొనుచుండు'
మని చెప్పి తనమెడలోని పూలదండ తీసి యాతనిమెడలో
వైచి ముఖమువంకఁ దేఱిపాఱి చూచి మాధవునిఁగా నెఱింగి
సిగ్గుపడి 'ఇసీ! లవంగికా! నన్ను మోసపుచ్చితివా?' యన,
నతఁడు 'ప్రేయసీ! నీపరితాపము దీర్చుకొన నీవు చూచికొను
చుంటివిగాని నాబాధఁ జూడవైతివిగదా?' యని యనురాగ
వచనములతో నామె నాదరించుచుండె. అంతఁ గామందకి
యచ్చటికివచ్చి 'ఇంతవఱకు నొకరికొఱ కొక రధికపరితాప
పడుచు 'నింక జాగు సేయ నేల? మాధవా! యాకన్యను నీవు
పరిగ్రహింపు' మని దేవతాసాక్షికముగాఁ బాణిగ్రహణము
చేయించి పరస్పరానురాగంబున వర్ధిల్లుఁడని దీవించి 'యిచ్చ
టికి సమీపమందలి యుద్యానవనమున నవలోకిత వివాహ
సన్నాహము చేయుచున్నది. మీ రచ్చటి కేగుఁ' డని
వారి నచ్చటికిఁ బంపి మాలతికై తెచ్చినవస్త్రాలంకారాదు

లను మకరందున కలంకరించి యాకృత్రిమమాలతి నింటికిఁ గొనిపోయి నందనునకుఁ బెండ్లి గావించెను. మాలతిని గృహప్రవేశమునకై నందనునియింటికిఁ దీసికొనివెళ్ళిన పిదపఁ గామందకి తరువాతికార్యమును బుద్ధరక్షితకు లవంగికకుఁ జెప్పి శీఘ్రముగ నాశ్రమమున కేగెను.

నాఁటిరాత్రి నందనుఁడు శయనగృహంబునకు వచ్చి యామాయామాలతి నెన్నియో విధముల బతిమాలియుఁ బ్రయోజనంబు గానక ప్రాణము విసిగి 'ఛీ! యిఁక దీని మొగముఁజూడ' నని యాగది విడిచి పోయెను. ఆసమయమున నందఱును నిద్రించిరి. కాని బుద్ధరక్షితయు లవంగికయు మాత్రము కీ లెఱిఁగినవారు గావున మేల్కొని యుండిరి. అతఁడు వెళ్లిపోవుటను జూచి బుద్ధరక్షిత మెల్లగా మదయంతికయొద్దకు వెళ్లి దానిని లేపి 'చెలీ! నీయన్న మాలతిపైఁ గోపగించి వెడలెను. మనము వెళ్లి మాలతికి బుద్ధి సెప్పుదము రా' యని దానిఁ దీసికొనివచ్చి దొంగ నిద్ర పోవుచున్న మాయామాలతి యగు మకరందునిఁ జూపి 'చెలీ! మాలతి నిద్రించుచున్న ట్లున్నది. లేచువఱకు నీవీ శయ్యపైఁ గూర్చుండు' మని చెప్పెను. మదయంతికయు నట్లు వసించి 'బుద్ధరక్షితా! మాయన్న చిన్నవాఁడుగాఁడు. ఊరక కోపగించువాఁడు గాఁడు. నాఁడు పులి గొడవలో నీమె మాధవునిఁ గౌఁగిలించుకొనినది. ఆవృత్తాంత మతఁ డేమయిన వినెనేమో?' యని మాలతినేరము లెన్నుచుండ, లవంగిక 'చాలులే, మాచెలిపై నేరములెన్నకు, మాతన వధూవరులముచ్చట లిట్లుండవా? మాధవునిమాట నీకేల? పులిగొడవనాఁడు నీవు మకరందుని గౌఁగిలించికొనిన మాట

మఱచితివా?' యని యెత్తిపొడిచె. దానిపై మదయంతిక, మకరందుఁడు తనకుఁ జేసినమేలు తలఁచికొని యాతనిపై ననురాగమున నిట్టూర్పువిడువ, లవంగిక 'నీవు మకరందునికై యిట్లు పరితాపపడుచుంటివిగదా' యనెను. అందుల కామె 'కాదుకాదు. మాలతిపరితాపము నభినయించితి' నని బదులు సెప్ప, లవంగికాబుద్ధరక్షితలు 'నిజముగా నీకు మకరందునిపై నెట్టి యభిప్రాయము గలదో చెప్పు' మని యడిగిరి. దానిపై నామె యతనియందుఁ దనకుఁ గలయనురాగము దెల్పి "యిఁక మాయన్నను బతిమాలి తీసికొని వత్తము రం" డని లేఁవగా మకరందుఁ డామెచేయి పట్టుకొనెను. అంత మదయంతిక 'చెలీ! లేచితివా' యని యటు చూచి మకరందునిఁగా నెఱింగి భయము నటింప మకరందుఁ డోదార్చెను. బుద్ధరక్షితయు 'నీకై మాచెలి మిక్కిలి పరితాపపడుచున్నది. దీనిఁ బరిగ్రహింపు' మని మకరందుని చేతికి మదయంతిక నప్పగించి 'యిఁక మనము మాలతి యున్నచోటికిఁ బోవుదము రం' డన, 'మదయంతిక మాలతి గూడ నిట్లే తన పంతము నెఱవేర్చుకొనెనా' యని యడుగ 'నట్లే జరిగిన' దని యామె చెప్పె. పిదప నందఱును బెరటి దారిని బయలువెడలపోవుచుండ వీథిలో రక్షకభటులు మకరందునిఁ బట్టుకొనిరి. ఇంతలో నిచ్చట నేమి జరుగుచున్నదో యని తెలిసికొని వచ్చుటకై మాధవునిచేఁ బంపఁబడిన కలహంసుఁ డెదురువచ్చి బుద్ధరక్షితాది స్త్రీలను దీసికొని వెళ్లెను.

ఇది యిట్లుండ నుద్యానమున నొకచో మాలతియు మాధవుఁడు నవలోకితయుఁ గూరుచుండి యుండి ముచ్చట

లాడికొనుచుండఁగా మాటలధోరణినిబట్టి 'అయ్యో! యింకను లవంగిక వచ్చినది గా' దనిమాలతి విచారించె. 'తెలిసికొని వచ్చుటకుఁగలహంసుఁడు వెళ్లెనుగదా? ఇంతలోనేవిచార మేల' యని మాధవుఁ డామె నోదార్చుచుండఁ గాలిచప్పుడు విని బుద్ధరక్షిత 'యెవరో వచ్చుచున్నా' రనెను. అంత మాధవుఁ డటుచూచి 'కలహంసుఁడే వచ్చె' ననుచుండ మాలతి యటు పరిశీలించి చూచి 'అదిగో మదయంతికయు నాచెలి యగు లవంగికయు బుద్ధరక్షితయుఁ గూడ వచ్చు చుండి' రని సంత సించి 'ఆర్యపుత్రా! మీ మకరందునకు మదయంతిక లభించి నట్లున్న' దని నుడివె. దాని విని మాధవుఁడు తన మెడ లోని పూలమాలను గానుకగా నామె మెడలో వైచు నంతలో వారందఱును సమీపించిరి. బుద్ధరక్షితయు మక రందుని రక్షకభటులు పట్టుకొన్న వార్త వినిపింప "భయపడ కుఁడు, నేను వెళ్లి మిత్రుని విడిపించుకొని వచ్చెద" నని మాధ వుఁడు కలహంసుని వెంటఁగొని వెడలెను.

అంత మాలతి 'యీ వృత్తాంతమును గామందికిఁ దెల్పి రం' డని యవలోకితాబుద్ధరక్షితలను బంచి, 'శత్రువుల మీఁదికి బోవునపుడు మెలఁకువతో నుండవలయు' నని మాధవునకుఁ జెప్పివచ్చుటకై లవంగికను బంపి, కొంతసేపు మదయంతికతోఁ మాటలాడుచుఁ గూరుచుండి, 'యింకను లవంగిక వచ్చినది గాదు, చూచివచ్చెద నిందుండు' మని మదయంతికతోఁ జెప్పి, పదియడుగు లీవలకు వచ్చినంతలో, నిదివఱకుఁ దనగురువును మాధవుఁడు చంపినందుకు బ్రత్యు పకారము సేయఁబూనికొని సమయము వెదకుచున్న కపాల కుండల మాలతి నెత్తికొని శ్రీపర్వతముమీఁదికిఁ దీసికొని

పోయెను. ఎంతసేపునకును మాలతి రాకపోవుటను జూచి మదయంతిక యీవలకు వచ్చి యపుడే వచ్చుచున్న లవంగి కతోఁ గలిసి మాలతిని వెదకుచుండెను.

ఇంతలో రాజసేనను చెల్లాచెదరు గావించి తమ పరాక్రమంబునకు సంతసించిన పద్మావతీరాజొసంగిన కానుకలు గైకొని మాధవ మకరందులు తమ వార్తను భార్యలకుఁ దెలుప నత్యుత్సాహముతో నిచ్చటికి వచ్చి మదయంతికా లవంగికలవలన మాలతి వృత్తాంత మెఱింగి విచారించి 'యొకవేళఁ గామందకి యొద్దకు వెళ్లినదేమో' యని యచ్చటి కేగి యందును గానక వారికి విచారము గలిగించి తాము దుఃఖపరవశులై చెట్టు పుట్ట యనక యడవులఁబడి తిరుగుచుఁ దుదకు బృహద్ద్రోణిపర్వతమును జేరినంత మాధవుఁడు నిశ్చేష్టుఁడై పడెను. అతని యవస్థనుజూచి నిరాశచే మకరందుఁడు తన మిత్రునికంటెఁ దానే ముందుగాఁ జావఁ దలఁచి కొండకొనకు వచ్చి యచ్చటినుండి క్రిందఁ బ్రవహించు పాటలావతిలోఁ బడుటకై సిద్ధపడుచుండె.

ఆ సమయమునఁ గామందకి శిష్యురాలును శ్రీపర్వతమునఁ దపస్సుచేసికొను చున్నదియు నగు సౌదామని మాలతి నెత్తికొని వచ్చిన కపాలకుండలను జంపి మాలతి నందే యుంచి యామె యిచ్చిన పొగడపూలదండ యానవాలుగాఁ దీసికొని దివ్యదృష్టిచే మాధవ మకరందుల యవస్థ నెఱింగి వేవేగ బృహద్ద్రోణి పర్వతమున కరుదెంచి చచ్చుటకుద్యుక్తుఁ డగు మకరందుని నివారించి యతనితో మాధవుని జూడ వచ్చుచుండెను. ఇంతలో మాధవుఁడు తెలివి నెంది నలుదిక్కులు పాఱఁ జూచుచుండ సౌదామిని సమీపించి

తన చేతిలోని వకుళమాల యాతనికిచ్చి మాలతి వృత్తాంత మును దెల్పి తన మంత్రప్రభావముచే వారిని శ్రీశైలము నకుఁ దీసికొనిపోయి మాలతిని జూపెను. ఈ యద్భుత వృత్తాంతమును గామందకికిఁ దెల్ప మకరందుఁడు ముందుగా బయలుదేఱి వచ్చి యంతకు మున్నే మాలతియెడ నిరాశ చేసికొని మధుమతీనదిలోఁ బడి చచ్చుటకు సిద్ధపడుచున్న కామందకిని లవంగికను మదయంతికను జూచి వారికి మాలతీ మాధవులు సుఖముగా నున్నవార్తఁ దెలిపెను. వారును సంతసించి వారి రాకకై యెదురుచూచుచుండిరి. ఇది యిట్లుండగా నందనుఁడును బద్మావతీరాజును, దమ మూలముగా నిట్టి యాపత్తు వచ్చినదని విచారపడుచుఁ బుత్త్రికా శోకమున మునిఁగియున్న భూరివసువు నెంత యోదార్చినను నతఁడు శాంతింపక శివాలయమునొద్ద నగ్నికుండములోఁ బ్రవేశించుటకు సిద్ధపడుచుండఁగా మాలతీ మాధవులను గామందకి దగ్గఱకుఁ దీసికొని వచ్చుచున్న సౌదామని దివ్య దృష్టిచే దాని నెఱిఁగి వారిని నడుదారిలో విడచి ముందుగా శివాలయమునొద్ద కేగి మాలతి వార్త నెఱిఁగించి యాతని బ్రతికించెను. మాధవుఁడును దంత్రికై వగచుచున్న మాలతిని దీసికొని కామందక్యాదులను గలిసికొనెను. ఇంతలో సౌదామనియు నచ్చటికి మరలివచ్చి కామందకికి మ్రొక్కి మాలతీ మాధవ మకరందుల యుదంతము సెప్పి తరువాత భూరివసువును రక్షించుట తెల్పిన నందఱును సంతోషించిరి. తరువాత వీ రందఱును బురమున కేగిరి. అంత 'విద్యావంతుఁడు బుద్ధిమంతుఁడు పరాక్రమశాలియు సౌందర్యశాలియు నగు మాధవుఁడు నీ కల్లుఁ డగుట సర్వ

జనసమ్మతము. అతనికి మిత్రుఁడు నాతనికి సమానుఁడు నగు మకరందునకు మదయంతిక నీయ నంగీకరించె' నని భూరివసువునకు రాజు వ్రాసిన జాబును సౌదామని కామందకికిఁ జూపెను. ఆమెయు దానిఁ జదివినతోడనే యందఱు నపరిమితానందభరితులైరి. పిదప మహావైభవముతో మాలతీ మాధవులకును మదయంతికా మకరందులకును వివాహములు జరిగెను. అందఱును సుఖంబుండిరి.

సమాప్తము.